# రాజ్యలక్ష్మి

( ఆరంకముల సాంఘికనాటకము. )

నందూరి బంగారయ్య

రాజమహేంద్రవరము.

వెంకటరమణ పబ్లికేషన్సు
సుల్తాన్ బజార్,
హైదారాబాద్.



1938

వెల 0-8-0.

ఈ నాటకము నందలి సర్వస్వామ్యములు నాటకరచయితవి. ఈ నాటకమును ప్రదర్శింపగోరువారు రచయిత యొద్ద నుండి లిఖితపూర్వకముగ ననుమతి గైకొనవలెను. వ్రాతప్రతులాడుట కిచ్చిన యనుమతులు ఇందుమూలముగ రద్దుచేయబడినవి.

# పీఠిక

ఇది నా ప్రథమనాటకము. నాట్యకళయొక్కయు నాటకకళయొక్కయు ఔత్కృష్ట్యమును నిరూపించుటయే దీని ముఖ్యోద్దేశము. "స్త్రీలే స్త్రీపాత్రములు ధరింపవలెనా" యనుప్రశ్నము నాధారపరచుకొని కథనల్లి యథానుకూలముగ ప్రస్తుతనాటకరచనమునందును నాట్యరంగమునందును గల లోపములను వానిని సంస్కరించుకొనుమార్గములను స్ఫురింపజేసినాను. "ఆపరితోషా ద్విదుషామ్ నసాధుమన్యే ప్రయోగవిజ్ఞానమ్." అని కవికులగురువగు కాళిదాసు పలుకుచుండగ నావంటివానికి నాటకరచనమున విశ్వాస మెట్లుదయించును? మహాకవులు వహింపవలసిన భారమును పైవైచుకొనిన నా చాపలమును సహృదయులు మన్నింతురుగాక!

ఇందలి నాలుగవయంకమునందలి నాలుగవరంగములోని యంతర్నాటకసన్నివేశము శ్రీమతి [illegible] వరలక్ష్మమ్మగారి "ఒట్టు" అనుకథ చదువుటవలన నాకు స్ఫురించినది. ఇందలి హిందీగీతము శ్రీకొమాండూరి గోవిందరాజాచార్యులవారు రచించియిచ్చినది. వారిరువురికు నా కృతజ్ఞతాపూర్వకనమస్కృతులు.

ఈ నాటకమును రచించితినని తెలసికొని రాజమహేంద్రవరమునందలి సహృదయులను సుప్రసిద్ధనాటకరచయితలగు బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి యాధిపత్యమున సమావేశపరచి వారికి దీనిని నివేదించు నవకాశము గల్పించిన నా మిత్రులు శ్రీయుత అవసరాల వెంకటనర్సుపంతులుగారు నాకు వందనీయులు. దీనిని తమ కాలేజీనాటకసమాజమువారిచే ప్రదర్శింపజేసిన గవర్నమెంటు ట్రెయినింగుకాలేజీ ప్రిన్సిపాలుగారును, అభిజ్ఞులును అగు శ్రీ విస్సా అప్పా

రావుపంతులుగారికిని, శ్రీ ట్రెయినింగుకాలేజీనాటకసమాజమువారికిని గూడ నా కృతజ్ఞతాపూర్వకవందనము లర్పించుచున్నాను. దీని ముద్రణమును శ్రద్ధతో నిర్వహించిన శ్రీ సరస్వతీప్రెస్సువారు ముఖ్యముగ శ్రీ అయ్యగారి బాపిరాజుగారు ప్రశంసార్హులు.

ఈ నాటకరచనమున సలహా లిచ్చుచు తోడ్పడిన సహృదయులకును దీనిపయి నభిప్రాయము లిచ్చి యాశీర్వదించిన విద్వాంసులకును భక్తిపూర్వకముగ నమస్కరించుచు ఆంధ్రభారతికి దీనిని నే నంకితము చేయుచున్నాను.

రాజమహేంద్రవరము
6—1—1938
పుష్య శు॥ ౫ గురువారము

ఇట్లు,
బుధవిధేయుడు,
నంహారి బంగారయ్య.

---

## ఈ నాటకమునవచ్చు ముఖ్యపాత్రములు.



### స్త్రీలు

* రాజ్యలక్ష్మి :—కథానాయిక. జగన్మోహనరావుభార్య.
* స్నేహలత :—బి. యె. ప్యాసయిన బాలవితంతువు. జగన్మోహనరావు వలపుగత్తె.
  కృష్ణవేణమ్మ :—జగన్మోహనరావు తల్లి. వృద్ధురాలు.

### పురుషులు

* జగన్మోహనరావు :—కథానాయకుడు. నాట్యవిద్యాభిమాని.
* శ్యామసుందర్ ఐ. సి. యస్. జిల్లాజడ్జీ.
* శంకరరావు :—పబ్లికు ప్రాసిక్యూటరు.
* పూర్ణయ్య :—స్కూలుమాష్టరు. జగన్మోహనరావు కుటుంబమునకు హితుడు.
  శేషగిరిరావు :—శంకరరావుగారి యాంతరంగిక మిత్రుడు.
  ప్రభాకరము :—జగన్మోహనరావు మిత్రుడు. నటుడు.
* బ్రహ్మానందస్వామి :—విద్యాపురమున నాశ్రమము నిర్మించుకొని వసించు యోగి.

శివశంకరపాండ్యా<br>గుండురావు } ఉపన్యాసకులు.

ఇంకను యథోచితముగ సభ్యులు, సామాజికులు, ప్లీడర్లు, డఫేదారు, బెంచిక్లార్కు, అసెసర్లు, కవిశుంఠ కర్కోటకశాస్త్రి మొదలయిన పాత్రములను జూచుకొనునది.

* ఈ గుర్తుగల పాత్రములు ప్రధానపాత్రములు. వానికి సరియైన వారు దొరకినచో నాటకప్రదర్శనము రక్తికట్టును.



# రాజ్యలక్ష్మి



## మొదటి యంకము



### మొదటిరంగము

రంగము—జగన్మోహనరావు గృహము

సమయము—సాయంకాలము 5 గ॥

[ ప్రవేశము—డ్రెస్సు వేసికొనుచు జగన్మోహనరావు ఆతనికి సాయము చేయుచు రాజ్యలక్ష్మి ]

జగ—విశ్వమే విచిత్రనాటకము. విశ్వాతీత మయిన బ్రహ్మము అంత కంటెను చిత్ర మయిన మహానాటకము.

ఉ. సుందర మై, కళావిభవశోభిత మై, మకరందబిందుని
ష్యందిని యై, జగత్ప్రభవసంహరణస్థితిమూలకంద మై,
బంధురనాదపూర్ణపదభాసుర మై యలరారు సచ్చిదా
నందరసాత్మకం బయిన నాటకరాజము నాశ్రయించెదన్.

రాజ్య—మీరు చెప్పినది చక్కగనే యున్నది. అట్టి నాటకరాజము నాశ్రయించుకొని యూరకుండక, ఆమహానాటకములో మరల నీ యంతర్నాటకము లెందులకు ?

జగ—ఇ వన్నియు ఆమహానాటకార్థము నన్వయించుకొనుటకు సాధనములే.

రాజ్య—కావని నేనును వాదింపను. మహర్షులు కూడ నాట్యకళ నారాధించి రనుటకు నిదర్శనము లున్నవి. కాని ప్రస్తుతము మన సంఘములో నీతికిని రసోపాసనకును సమన్వయము కుదురుటలేదు,

అందును స్త్రీలే స్త్రీపాత్రములు ధరింపవలె నను సిద్ధాంతము ప్రబలు చున్నకొలది నాటకరంగము మరింత భ్రష్ట మగుచున్నది.

జగ—వెఱ్ఱిదానా! నీతికిని కళోపాసనకును ఎంతమాత్రము సంబంధము లేదని నీ వెరుగవా? కళాప్రపణులు కేవలసౌందర్యోపాసకులు. స్త్రీసౌందర్యము స్త్రీలాలిత్యము స్త్రీపాత్రధారిణియగు స్త్రీ కలవడి నట్లు ఎన్ని జన్మము లెత్తినను మగవాని కలవడునా?

రాజ్య—పాత్రధారణమునకు ప్రావీణ్యమే ప్రధానసూత్రముగ నుండ వలెను గాని స్త్రీపురుషవివక్షత యేలనో నాకు బోధపడకుండ నున్నది. కేవలకళోపాసనమున కీ సూత్రము శోషకము కాని పోష కము కాదే? వెనుక మీరుకూడ ఈ విషయమున నాతో నేకీభవిం చెడివారు. ఇప్పుడు మీ స్వరూపముతో బాటు—మీ చరిత్రముతో బాటు—మీ యభిప్రాయములు కూడ మారిపోయినవి కాబోలును.

సీ. వెల్లదోవతి దాల్చు వినయసుందరమూర్తి
సిలుకుపంట్లాముల గులుక సాగె;
శ్మశ్రుసంగతి రోయు సదమలాచారుండు
అరమీసముల దాల్చి మురియజొచ్చె;
పరిహాస మెరుగని పావనమితభాషి
వాచాలతకు పేరు వడయనేర్చె;
సంధ్యాలం దిలుదాట సంశయించు మహాత్ము
డర్ధరాత్రవిహార మభ్యసించె;
గీ. డ్యాన్సు లందును, షాంపేనుడ్రాము లందు,
నాటకములను, అభినవబూటకముల
మునిగి తేలుచు నున్న మీ మూర్తి జూచి
ఎంత చింతింత్రొ వెనుకటి హితులు నేడు?

జగ—వాదన మాని వ్యక్తిదూషణకు గడంగినచో నిక నీతో మాటాడ వలసిన పని లేదు.

రాజ్య—వ్యక్తిదూషణ కొఱకు గాదు. ఆంధ్రనాటకకళ నుద్ధరించుటకు మీరు బద్ధకంకణులుగదా. అట్టి మీచరిత్రము సర్వథా నటకుల కెల్ల నాదర్శప్రాయము కావున దాని నింత విమర్శింపవలసి వచ్చినది — కోపము వచ్చినచో మానివైచెదను.

జగ—మహాసముద్రము వలె నపారమగు విశ్వములో బుద్బుదప్రాయముగ నున్న నాచరిత్ర మెవనికి గావలయును ?

రాజ్య—కా వలసిన దానను గావుననే ప్రసక్తి తేవలసి వచ్చినది. అట్లు చేయుటకు నా కధికారము లేదని మీరు భావించినచో మానివైచెదను.

జగ—అబ్బ ! ఎంతసేపును నిష్ఠురములే గాని వక్తవ్యాంశమునకు రానీయవు గదా !

రాజ్య—పోనిండు. ఒక్కమాట యడిగెదను. స్త్రీలు స్త్రీపాత్రములు ధరించినచో నాటకరంగ మెక్కనను నియమము మీకుండెడిదా లేదా ?

జగ—ఉండెడిది. అయితే యెన్నడు నభిప్రాయములు మార్చుకొనరాదని నీ యభిప్రాయమా ? నాటకప్రదర్శనానుభవము హెచ్చిన కొలది స్త్రీపాత్రమును ధరించుటకు పురుషు డసమర్థు డని నాకు గట్టిగ నచ్చుచున్నది.

రాజ్య—అక్కడనే నేను మీతో నేకీభవింప జాలకున్నాను. రసోపాసనదృష్టితో చూచినచో స్త్రీలు స్త్రీపాత్రములు ధరింప నసమర్థులని నేనును వాదింపను. కళాప్రావీణ్య మొక్కరి సొమ్ము కాదు. దానిలో ప్రవీణు లయినవారు స్త్రీలలోను ఉండవచ్చును. పురుషులలోను ఉండవచ్చును. “ ఎవరు ప్రవీణు లయినచో వారే పాత్ర

ధారణ మొనర్పవలెను గాని దీనిలో గూడ లేనిపోని లింగభేద మెందులకు" అని నావాదన.

జగ—అంతవరకు నంగీకరించినావుగద. ఇట్టి విషయములలో కేవలము యుక్తివాదనము పనికిరాదు. అనుభవమే ప్రధానాధారము. అవయవనిర్మాణాదులయందు స్త్రీకిని పురుషునకును ఎంతో వ్యత్యాసము భగవంతుడే కల్పించినాడు.

రాజ్య—మీ సూత్రమే యంగీకరించినచో అభినయవిద్య కవకాశమే లేకుండనున్నది. స్త్రీపాత్రమును స్త్రీలే ధరింపవలసి వచ్చినపుడు రాజపాత్రమును రాజులే ధరింపవలదా? దేవతాపాత్రమును దేవతలే ధరింపవలదా? ఇంకను దూరముగ బోయినచో హరిశ్చంద్ర పాత్రమును హరిశ్చంద్రుడే ధరింపవలసి యుండునేమో. ఎన్ని పుటములు వైచినను నటకుడు హరిశ్చంద్రుడు కాగల్గునా?

జగ—అదిగో మరల యుక్తివాదమునకు దారితీయుచున్నావు. యుక్తివాదమునకును యథార్థమునకును చాలదూరమున్నది.

రాజ్య—పోనిండు. మీరు చెప్పిన అనుభవసిద్ధాంతమును బురస్కరించుకొని చూచినను స్త్రీపాత్రములను స్త్రీలకంటె నెన్నియోమడుంగు లధికచాతుర్యముతో నభినయించు పురుషులు లేరా?

జగ—(విసుగుతో) ఉండ వచ్చును. మాన వచ్చును. నా కవతల టీపార్టీకి వేళ యగుచున్నది—ఈ వితండవాదములతో గూర్చున్నచో తెమలదు.

(అని పోబోవును)

రాజ్య—మీ యర్ధాంగిని గావున—మీ యుభయలోకముల క్షేమములో నాకుగూడ గొంత బాధ్యత యున్న దనుకొనుచున్నాను గావున—మీరు కొంతవరకు చనవిచ్చుచున్నారు గావున—ఇంతవరకు మాటాడితిని; క్షమింపుడు.

జగ—అబ్బబ్బ! అంతలోనే మూతిముడుపా? ఇప్పుడు సావకాశము లేదన్నాను గాని నీ కధికారము లేదన్నానా?

రాజ్య—నాధా! ఈ తరుణము దాటినచో నిక మీతో ముచ్చటించి యేమి? ముచ్చటింప కేమి?

జగ—(వెనుకకువచ్చి) సరే కానిమ్ము. స్త్రీలు స్త్రీపాత్రములు ధరించుట కనర్హులు కారని నీవే యంగీకరించితివిగదా?

రాజ్య—అంగీకరించితిని కాని స్త్రీలును పురుషులును కలసి యొక్క రంగము పయి నాటక మాడుట ప్రమాదకరము కాదని యంగీకరించితినా?

జగ—కేవలము కళోపాసనకయి ఒక్కచో జేరినంతమాత్రమున ప్రమాద మేమియుండును?

రాజ్య—ఏమి యుండునో మీకే తెలియవలెను. పరస్త్రీలతో సర్సోక్తులాడుటయే విద్యగ నభ్యసించుచు శీలము దక్కించుకొనుట ఎంతవారికి గాను?

జగ—అయినచో నాటకరంగమున శీలము గాపాడుకొనుచున్నవారు లేనే లేరందువా?

రాజ్య—ఎట్లనగలను? కాని ప్రమాదమున కవకాశమెక్కుడని నావాదము. నాలుకమీద పంచదార నుంచుకొని నోటిని ద్రవింపకుండ శాసింపగలమా? పూవును నాసికాపుటముదగ్గరకు దెచ్చుకొని తావి నాఘ్రాణింపకుండ నియమము వహింపగలమా? స్త్రీలతో గలసి శృంగారమభినయించుచు స్త్రీ సౌందర్యమునకు చలింపకుండ శీలమును గాపాడుకొనగలమా?

జగ—చదివినకొలది నీకు వెనుకటిమతికూడ పోవుచున్నదేమి? హిందీలోను సంస్కృతమునందును పాండిత్యము సంపాదించి నందులకిదియా ప్రతిఫలము?

రాజ్య—ఇది వ్యక్తిదూషణము కాదు కాబోలును ! మనకీ వితర్క మెందులకు ? మీ సిద్ధాంతము నంగీకరించి నేను రంగభూమి కెక్కి ప్రణయ మభినయించుటకు మీ రంగీకరింతురా ?

జగ—ఆ.

రాజ్య—వాదము నిమిత్త మొప్పుకొనుట కాదు.

జగ—నిశ్చయముగ నంగీకరింతును.

రాజ్య—తలవంచుకొని చెప్పినచో లాభము లేదు.

జగ—(చిరునవ్వుతో) నీవు పాత్రధారణ మొనర్చి నాటకరంగ మెక్కి నాట్యకళారాధన మొనర్చు సుదినమే తటస్థించినచో నిన్ను పువ్వుల రథములో నుంచి యూరేగింపనా ?

రాజ్య—సరే ఆమాట మీద నిలువబడుడు. దాని కేమి గాని ఒక్క మాట అడుగుచున్నాను. స్త్రీలతో నటించినను పురుషులతో నటించినను మనదేశములో నిలుపరాదా ? ఈవిదేశయాత్ర కూడ నెందులకు ?

జగ—నీవంటి విదుషీమణికి గూడ ఈయంశము వివరింపవలెనా ?

ఉ. గాజులు దాల్చి యింటికడ గౌరవహీనపుజీవితంబుచే
రోజులు నెట్టుటే ఘనమొ ? రోదసి నిండిన కీర్తికామినీ
తేజము భారతాంబికకు దీనత బాపగ పశ్చిమంబునన్
పూజల గాంచుటే ఘనమొ ? బుద్ధిబలంబున నెంచిచూడుమా.

రాజ్య—జన్మభూమి యెడ మీకున్న గౌరవము సంస్తవనీయమే గాని "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" యనుటలో జన్మభూమి కంటెను జననియే ప్రథమస్థానము నాక్రమించుచున్నది గదా ?

జగ—కాదను వారెవ్వరు ?

రాజ్య—ఇంతవరకు నిలవేల్పువలె పూజించుకొని వచ్చినారు. మీతల్లి గారి ముప్పు గడిపిన తరువాత పోరాదా ?

జగ—మాతల్లిగారి కిప్పుడేమి ముంచుకొని వచ్చినది ?

రాజ్య—ఎంత సరసముగ మాటాడు చున్నారు? అయిదుగురు పుత్రికలను గోలుపోయి, కడుపుశోకముచే క్రుంగి–కృశించి,–ఏక పుత్రు లయిన మిమ్ము చూచుకొని దినము లీడ్చుచున్న యావృద్ధ తపస్వినిని గూర్చి మీరింత చులకనగ నెన్నడయిన మాటాడి యెరుగుదురా ?

జగ—నే నారు మాసములలో తిరిగి వచ్చెదనని చెప్పుటలేదా ?

రాజ్య—డెబ్బదియేండ్లు దాటిన వృద్ధురాలు. నేడో రేపో యను నట్లుగ నున్నది.

జగ—అయినచో నీవున్నావు గదా ?

రాజ్య—కర్మాధికారు లగు మీరుండవలెను గాని నే నుండిననేమి ? ఊడిననేమి ?

జగ—నటకులందరును అప్పుడే బొంబయి చేరినారు. "స్నేహ లత" యీ ప్రయాణము నిమిత్త మిప్పటికి ఒకలక్ష రూప్యము లయిన వెచ్చించినది. మా ప్రయాణమునుగూర్చి యప్పుడే పత్రి కలలో ప్రకటించినారు.

రాజ్య—పత్రికలు వేదములు కావుగద ! మీప్రయాణ మాగిపోయిన దని మరల రేపు ప్రకటింపగలవు. అదిగాక, ఇప్పుడిప్పుడే నాలుగు మూలల నుండియు ప్లీడరీలో ప్రాక్టీ సందుకొనుచున్నది. పబ్లికు ప్రోసిక్యూటరీపదవికూడ మీకు లభించు నవకాశము లున్నవని పూర్ణయ్యబాబుగారు చెప్పుచున్నారు.

జగ—దిక్కుమాలిన పబ్లికుప్రోసిక్యూటరు పదవి! దీనివలన సంపా దించిన దెంతగాను? మానిన దెంతగాను? ముప్పదియేండ్లనుండి పబ్లికుప్రోసిక్యూటరీ చేయుచు శంకరరావుగారు మూడులక్షలు నిలువచేయుసరికి చచ్చిచెడిచేయుంగలవిన్నపము లయినది.

రాజ్య—మీ రంతకంటె నెక్కుడు సంపాదింపవలె ననియా?

జగ—వారమునకు పదివేలపౌనులు సంపాదింపగలను. ఇప్పుడు సినీమా నటుల జీతములలో సగము లేవు హైకోర్టు జడ్జీల జీతములు.

రాజ్య—మీయాశ విమానముమీద నెగిరిపోవు చున్నది. వేశ్యా వృత్తిలో వలె నీవృత్తిలో, సంపాదించుట యెంత సులభమో ఖర్చుపెట్టుటయు నంతే సులభము. మీ రార్జించిన దంతయు శాశ్వతబ్రహ్మకల్పముగ నిలువయుండు నని మీయభిప్రాయమా?

"యదహ్నా త్కురుతే పాపమ్ తదహ్నా త్ప్రతిముచ్యతే"

జగ—ఈవాదన మంతయు నెందులకు? ఆరునెలలు కనులుమూసి కొనుము. నేను కోటీశ్వరుడను గా కున్నచో నా పేరు మారుపేరు పెట్టుము.

రాజ్య—నేను వేరుగ పెట్ట నక్కరలేదు. మారుపేర్లు మీరే పెట్టుకొను చున్నారు—నాటకములలో. నాకయి నేనంత చింతింపను. మీ జనని కయి కూడ అంతచింతింపను. కాని కోటి కోహినూరుల విలువ చేయు మీశీలమునకు చెదపట్టుచున్నదిగదా యని నా విచారము.

జగ—నీ విచారమున కెంతమాత్రము నాధారము కానరాదు.

రాజ్య—మరల నొకసారి ప్రార్థించుచున్నాను. తీర చేతులు గాలిన వెనుక నాకులు పట్టుకొనవలసి వచ్చునేమో యాలోచించు కొనుడు.

జగ—చేతులును గాలవు మూతియు గాలదు. నీ వూరకుండుము.

రాజ్య—అయితే తప్పదా?

జగ—తప్పదు మరి.

రాజ్య—

ఉ. చిన్నతనంబునుండియును చేసిన స్నేహము దోహలింప, మీ
కన్నుల నన్నలన్ మెలగి గౌరవమందిన ధర్మపత్నినై

విన్నపమున్ బొనర్చెదను. వేసరబోక—విదేశయాత్రలో
సన్నిధి దాసినై మెలగు సౌఖ్యము నైన ననుగ్రహింపరే.

జగ—సరి. సరి. నీవు నాతో వచ్చినచో మాతల్లి గారికిక్కడ నుప చారము చేయువా రెవ్వరు ?

రాజ్య—వారినికూడ తోడ్కొని పోవచ్చునుగదా.

జగ—ముసలమ్మలు కాశీయాత్రను మాని లండనుయాత్ర సంకల్పించు దినములు ముందు రావచ్చు నేమో గాని ఇంతవరకు రాలేదు. ఆమె యంగీకరింపదు.

[తెరలో 'అబ్బాయీ' అని కృష్ణవేణమ్మ కేక.]

జగ—ఈమె సిప్పుడు వదల్చుకొనుట దుస్తరము[అని ఇంకొక ద్వారమున పోబోవుచుండగ పూర్ణయ్య ఎదురగును. జగ... వెనుకకు మరలును.]

జగ—ఇవేమి యపశకునములురా బాబు!

పూ—పశ్చిమఖండయాత్ర సంకల్పించుకొనిన నవనాగరకశిఖామణికి గూడ శకునములబాధ వదలలేదా ? పై కెన్ని వేషములు వేసినను లోపలనున్న భారతీయరక్త మెక్కడికి పోవును ?

[ఇంతలో కృష్ణవేణమ్మ ప్రవేశించును.]

కృ—(జగన్మోహనరావు గడ్డము పట్టుకొని) నాయనా! నన్ను మట్టి చేసిన తరువాత పశ్చిమఖండమునకు పోరాదా ?

పూ—పెద్దది. ఆవిడ మాటవిను. ఎందులకు చెడిపోయెదవు ?

జగ—పూర్ణయ్యమామగారూ! మీరు కూడ దీనిని చెడిపోవుట క్రిందనే భావించుచున్నారా ?

పూ—అసలు మనము వైదికశిఖామణులము. తపస్స్వాధ్యాయము లను వదలి ప్లీడరీలో బ్రవేశించుటయే పాతిత్యము. దానికితోడు ఇక నాటకరంగములుకూడ ఎక్క నారంభించినచోఁ జెప్పవలసిన దేమున్నది ? నటులు పంక్తిబాహ్యు లని నీవు వినలేదా ?

జగ—భాసకాళిదాసాదులు నాటకములు వ్రాసిరిగదా! ఆకాలములో నాటకము లాడువారు లేకున్నచో నాటకము లెట్లు పుట్టియుండును?

పూ—నాటకము లాడువారు లేరని నేనంటినా? ఆకవులు—ఆనాటకములు—ఆనటకులు—వారికథంతయు వేరు.

కృష్ణ—ఇప్పటి నాటకములలో పుణ్యమా? పురుషార్థమా? చక్కగ ఒకప్రహ్లాదచరిత్రమని — హరిశ్చంద్రచరిత్రమని — అంబరీషచరిత్రమని — ఆడవచ్చునా? అదిలేదు. ఎంతసేపు కుట్రలు — హత్యలు — వ్యభిచారము — దొంగతనము — ఇవి ఇప్పటి నాటకములలో తమాషాలు.

రాజ్య—ఆత్మ కౌన్నత్యముగాని హృదయమునకు వికాసముగాని ప్రసాదింప జాలిన నాటక మొక్కటియు గానరాదు.

పూ—బెల్లముగొట్టినరాయి వలె మాటలాడదు. మౌనముద్ర వహించినాడు.

జగ—మీ యుపన్యాసము లన్నియు నయిన వెనుక నేమయిన నవకాశ మున్నచో మాటాడవలెనని యనుకొనుచున్నాను. పూర్ణయ్యమామగారూ? బి.యె., యల్.టి. ప్యాసయిన మీరే యీతీరున మాటాడుచుండగ నిక జెప్పవలసిన దేమున్నది?

పూ—మీ తాతగారిని నే నెరుగుదును. ఆయన ఘనాంతస్వాధ్యాయి. ఎప్పుడు నిగమఘోషతో నిల్లు నిండియుండెడిది. వేలకువేల శిష్యులు — రాజాధిరాజులు కబురంపినను నిర్లక్ష్యము. ఒకరిచేతి క్రింద తనచేయి నెన్నడు ఉంచుట కంగీకరించెడువాడుకాడు.

కృష్ణ—అట్టికొంప కిప్పు డిట్టిగతి పట్టినది!

[స్నేహలత తొందరగ ప్రవేశింపబోయి వెనుకకు తగ్గును.]

పూ—రా అమ్మా — రా. నీమూలముననే ఇంతవరకు వచ్చినది.

జగ—మామగారూ! సర్వము తెలసినవారు. మీరుకూడ మర్యాద నతిక్రమించవచ్చునా?

స్నేహ—పూర్ణయ్యగారు తండ్రివంటివారు. వారిమాటలకు తప్పు పట్టుకొందునా? దానికేమిగాని టీపార్టీ కందరు వచ్చి మీ కొరకయి తొందరపడుచున్నారు. కలెక్టరుగారి కారు వైచుకొని నేను వచ్చినాను.

జగ—ఇదిగో వచ్చుచున్నాను. అమ్మా నీవు కంట తడిపెట్టకుము. అదినా కశుభము. రాజ్యం! ఆరుమాసములు దాటకుండ తిరిగి వచ్చెదను. మామగారూ! మాకుటుంబ యోగక్షేమములు రవంత విచారించుచుండుడు.

ఉ. మేటికళావిలాసముల మేలిముసుంగున జేరి నిల్చు నీ
నాటకరాజ్యలక్ష్మికి మనంబు సమర్పితమయ్యె. భారతీ
హాటకసౌధభూముల విహార మొనర్చుచు కీర్తి దిక్కులన్
నాటెద. వంశగౌరవ మనశ్వర మై వెలుగొందు గావుతన్!

[అని తల్లికి నమస్కరించి నిష్క్రమించును.]

పూ—కాలవిపర్యయ మెట్లున్నదో! కాగులో స్నేహాలతయు జగన్మోహనుడును ఒకరిప్రక్క నొకరు చెట్టపట్టములు వైచుకొని కూర్చున్నారు.

రాజ్య—ఈ గోముఖవ్యాఘ్రము వాతబడిన వెనుక నిక నెక్కడి నాథుడు?

ఉ. పుట్టిననాడె తల్లి చనిపోయెను తండ్రియు నేడు లేడు చే
పట్టిన భర్త యీగతిని భారతదేశము బాసిపోయెడిన్.
వట్టియెడారివోలె గనుపట్టుచునున్నది జీవితం బహో!
పట్టెద నీదుపాదము లపారకృపాకర భక్తవత్సలా!

కృష్ణ—మనయింటి కిది మహామారివలె దాపురించినదే అమ్మా.

రాజ్య—అత్తా, మనబంగారము మంచి దయినచో కంసాలి ననవలసిన పని యేమున్నది?

పూర్ణ—స్నేహాలత యయినను చెడ్డదికాదు. నవనాగరకతామాహాత్మ్యముచే—కాదుకాదు—కర్మవిపాకముచే నీయిరువురును నాటకములలో దిగి పాడయిపోయి యుండవచ్చును. ఇంతకు లోకాపవాదముల నెంతవరకు నమ్మవచ్చునో యెవరుచెప్పగలరు?

కృష్ణ—నిజముగ నారుమాసములలో తిరిగివచ్చు నందువా?

రాజ్య—అత్తా! ఏమి మీ అమాయకత్వము. ఆరుమాసములలో గాదు ఆరేండ్లలో నయినను వారు తిరిగి వత్తురను నమ్మకము నాకు లేదు. ఈనాటకప్రదర్శనము జూదము వంటిది. ఇందు ఓడినను కష్టమే, నెగ్గినను కష్టమే. దీనిలోదిగి జమీందారులు కొంపలమ్ముకొని పోయినారు.

కృష్ణ—పూర్ణయ్యా! ఈ దిక్కుమాలిన కష్టము లన్నియు ననుభవింపవలసినదని భగవంతుడు నాకింత దీర్ఘాయు విచ్చినాడేమోయి?

పూర్ణ—మీ రేమియు బెంగపహింపకుడు. మరల నొకసారి వారించి చూచెదను. (నిష్క్రమించును)

రాజ్య—ఎంత వారించినను లాభ ముండదు. అబ్బో! నే నెన్నివిధముల తెరిమి చూచినానుగాను? అన్నిటికి నన్ని చెప్పినారు.

కృష్ణ—కానికాలము వచ్చినపు డాపదలకు జంకినచో లాభమే మున్నది? నీవున్నావుగదా, నాకు కోడల వైనను నీవే! కొడుకు వైనను నీవే.

రాజ్య—నే నున్నా ననవేల? మనకిరువురకు భగవంతుడే యున్నాడు. కాలము బహువిపరీతముగ గనవచ్చుచున్నది.

చ. పిడుగులపిండు పై బడిన భీతిలకుండెడు ధైర్యమంత్రమున్
విడువక వేనవేలుగ జపించుచు దత్ఫల మందకుందునే?
అడ లాదవించు నీదు నినదార్భటి కియ్యెడ కాలమేఘమా!
వడకెడిదానగాను. భగవంతుని పాదము లాశ్రయించితిన్.

---

# రాజ్యలక్ష్మి



## రెండవ అంకము



### మొదటిరంగము

ప్రదేశము—విద్యాపురములో శంకరరావుగారి గృహము

సమయము—ఉదయము 10 గంటలకు

[ ప్రవేశము—శంకరరావు కుర్చీమీద కూర్చుండి పనిచూచు కొనుచుండగ వార్తాపత్రిక చేతబట్టుకొని శేషగిరిరావు ]

శంక—శేషగిరిరావు! మూఁడుదినము లన్నమైన లేకుండ నుండగలవు గాని ఒక్క దినము పత్రిక చూడకున్నచో బ్రతుకజాలవు. ఏమిటి పత్రికావిశేషములు?

శేష—నాఁబ్రతుకు మాటకేమి? ఇప్పుడు నేను చెప్పబోవువార్త వినినచో మీఁబ్రతుకు నిలువదేమో యని భయపడుచున్నాను.

శంక—అంత విడ్డూర మేమి వచ్చిపడినది?

శేష—మీ వెట్టికాని, నాటకమాడ నేర్చినవానిని టెన్నిస్ ఆడ నేర్చిన వానిని నట్టేటిలో బారవైచినను నిగ్రహించుకొని రాగలడు.

శంక—అనగ నా కర్థము కాలేదు.

శేష—మీ పబ్లికుప్రాసిక్యూటరుపదవి కెక్కడ భంగము తెచ్చునో యనికదా స్నేహలతతో జతకుదిర్చి జగన్మోహనరావును విదేశ యాత్రకు బంపినారు? అట్టి మీ గర్భశత్రువు నేఁడు విశ్వవిఖ్యాతు డయిన నటశిరోమణియైనాఁడు.

శంక—ఆలస్యము చేసి చంపుకొని తినుచున్నావు. అసలు మాటయేదో చెప్పవు.

శేష—చెప్పుట కేమున్నది? అమెరికానటసమావేశమున నాతనికి "నటచక్రవర్తి" బిరుదమిచ్చినారు.

శంక—నిజమేనా? నిజమేనా?

శేష—ఇదిగో పత్రికను చూడుడు. అమెరికాప్రెసిడెంటాతని నభినందించుచుండగ తీసిన ఛాయాపటము.

శంక—ఎంతపని జరిగినది! ఎంతపని జరిగినది! ఈసారి యాతడు హిందూదేశములో నడుగుపెట్టినచో పట్ట పగ్గములుండవు.

శేష—ఆతడు మరల మనయూరు రాకుండగను, వచ్చినను మనపదవికి భంగము తేకుండగను ఏదైన వ్యూహము పన్నవలయును. అభినవచాణక్యులుగదా! ఆలోచింపుడు. అయితే యింతవరకు మనము పన్నుచున్న వ్యూహము లన్నియు ఆతనికి మరింత యుచ్ఛదశను దెచ్చి మనకు ప్రాణాంతకముగ బరిణమించుచున్నవి.

శంక—నీవు చెప్పినది నిజమే. విదేశములలో నేసుఖరోగములవలననో ఏమద్యపానాధిక్యముచేతనో మరణించు ననుకొంటిని. కాని బంతివలె నేలకువైచి కొట్టినకొలది మరింత యెత్తుగ పై కెగురుచున్నాడు. కొంతసాధనసామాగ్రి యిదివరకే తయారుచేసి యుంచినాను. ఈసారి ఎటోఅటు తేలవలెను.

శేష—ఆతడు స్వదేశగమనోన్ముఖుడయినట్లు కూడ పత్రికలు ప్రకటించుచున్నవి. అందుచే మీరు తొందరపడవలెను. (వీధిగుమ్మమువంక దృష్టినిగుడ్చి) అదిగో. పూర్ణయ్య వచ్చుచున్నాడు.

శంక—ఇంతవరకు జగన్మోహనరావు కంటె నాకు పరమమిత్రుడు లేనట్లుగ నటించుకొని వచ్చుచున్నాను. ఈ పూర్ణయ్యకు వారికుటుంబమనిన భక్తి మెండు. జాగ్రతగ మాటాడవలెనుసుమా!

శేష—తెలివితక్కువగ నటచక్రవర్తిబిరుద మాతని కిచ్చినారు గాని మీ కీయవలసినది.

పూర్ణ—(ప్రవేశించి) నటచక్రవర్తి బిరుద మెవనికోయి?

శంక—(ఉత్సాహముతో) మనప్రాణమిత్రుడు జగన్మోహనరావుకు. నిజముగ నీకీవార్త యింకను తెలియనేలేదా? తెలిసియు తెలియనట్లు నటించుచున్నావా?

పూర్ణ—ఆనటనలు, ఆనక్క-వినయములు అన్నియు లాయర్లవి. "బ్రతికి చెడి బడిపంతు" లనినట్లు మాష్టరీ చేసికొనుచున్నవానికి నాకెందులకు?

శంక—ఇదిగో! ఈ పత్రిక చూడుము. నిజముగ మన పురవాసులు—మన పురవాసులే కాదు ఆంధ్రదేశవాసు లెల్లరును—ఆంధ్రదేశవాసులే కాదు-భారతీయు లెల్లరును గర్వింపవలసిన విశేషము!

పూర్ణ—(పత్రిక పరికించిచూచి పెదవి విరుచుచు) ఓస్! ఇంతేనా! నేతిబీరకాయవంటి బిరు దొకటి సంపాదించినాడా? ఈబిరుదము వలన నెవరి నుద్ధరించినట్లు?

శంక—మొత్తముమీద నాంధ్రుడ ననిపించుకొనినావు. ఆంధ్రులకు స్వజాతీయుడు మేరుపర్వతమంతటి ఘనకార్యము చేసినను అది మొంటిగింజవలె గనవచ్చును.

పూర్ణ—ఆతని కీబిరుదు వచ్చినందులకు సంతోషింపక కాదు. నిజముగ నాతని ఇంటిలోని యవస్థ చూడగ నాగుండె చెరువగు చున్నది. పుత్రశోకముచే తల్లి మరణించినది గదా! ఇక భార్యకు నిత్యము ఏకాదశియే. భర్తగారు విదేశములలో విందు లారగించుచుండగ భార్య స్వదేశములో పస్తు పండుకొనుచున్నది.

శేష—నాట్యవిద్యచే నెలకు నలువదివేలపౌను లార్జించు నటసార్వభౌముని భార్య పస్తు పండుకొనుట యేమోయి?

పూర్ణ—ఏమి నటసార్వభౌముడో నాకు తెలియదు. ఇంటినుండి పదచలనము చేసిన తరువాత పైస పంపలేదు. పోనీ క్షేమసమా

చారములు విచారించుచు ఒక్క కార్డయినను వ్రాయవచ్చునా? అదియును లేదు. జయోన్మాదమున స్వదేశమునే మరచిపోయినా డేమో తెలియదు. పాపము! ఆ యిల్లాలు పడుచున్న బాధ చూడగ పగవాని కైనను గుండె నీరగును. గతిలేక హిందీబోధన మారంభింపగ స్త్రీసమాజమువారు జీతము సరిగ నీయకుండ నున్నారు.

శంక—హరిహరీ! అంత యిబ్బందిపడు చున్నట్లు నాతో యింతవరకు చెప్పనేలేదు?

పూర్ణ—ఇప్పుడు చెప్పితిని గాదా. ఏమి చేసెదవో చూతము.

శంక—ఆలాగున నన్నావు. బాగున్నది. ఆ భారమంతయు నాకు వదలిపెట్టుము. నాదానము లన్నియు గుప్తదానములు గదా!

శేష—(తనలో) ఈ నిర్భాగ్యుడు రాజ్యలక్ష్మి పయి కన్నువైచి నాడు. అది నా కిదివరకే తెలియును. ఎంతదుర్మార్గు డయినను నాదగ్గర నేదియు దాచడు. అది కొంతసుగుణము — పాపము పూర్ణయ్య అమాయకుడు.

శంక—నేను ఆమెను కలసికొని రెండవ కంటికి తెలియకుండ నాకు తోచినదేదో ఆమెకిచ్చుట కామె యంగీకరించునా?

పూర్ణ—ఏబదియేండ్ల వాడవు. నీదగ్గర నామెకు సందేహ ముండునా? నీ యిష్టము వచ్చినట్లు చేయవచ్చును.

శంక—సరే ఆవిషయము త్వరలోనే తేల్చెదను. శేషగిరిరావు! మన మిత్రునికి జరిగిన గౌరవమునకు అభినందనసభ యొకటి యేర్పాటు గావింపుమని క్లబ్బుశెక్రటరీతో జెప్పవలెను.

పూర్ణ—మీకు మతియున్నచో నిజముగ నభినందింప వలసినది— ఎన్నికష్టములకయినను నోర్చి ఆత్మగౌరవము కాపాడు కొనుచున్న

ఆతని భార్యను గాని, కీర్తికాంతాన్వేషణతత్పరుడయి దేశద్రిమ్మరి యయిన ఆతనిని గాదు.

శంక—ఆమె నభినందింపవలసి వచ్చినపు డామె నభినందింపవచ్చునులే. ప్రస్తుత మీ కర్తవ్యము చూచుకొందము. కలెక్టరుగారి యనుమతి తరువాత గైకొనవచ్చును గాని ముందుగ, "వారధ్యక్షులుగ నుందు" రని ప్రకటింపవలసినదిగ జెప్పుము.

శేష—చిత్తము. సెలవు. (నిష్క్రమించును)

పూర్ణ—రాజ్యలక్ష్మిమాట మరువవలదుసుమా?

శంక—కబుర్లతో నేమిపని? క్రియలో చూచెదవుగాదా. రవంత ఫలాహారముచేసి పోదువుగాని రా.

(ఇరువురును లోపలికి పోదురు)

---

రెండవరంగము

ప్రదేశము—విద్యాపురములో నొకవీధి

సమయము—ఉదయము 9–30 గం॥లకు

[ప్రవేశము—పుష్పవల్లి అనుబాలిక ముందు నడచుచుండగ సుబ్బలక్ష్మి అనుబాలిక వెనుకనుండి ప్రవేశించును.]

సుబ్బ—ఇదిగో! ఓవిడా! పుష్పవల్లీ! ఉండవో, ఓస్. పెండ్లివారు వచ్చినా రని గర్వము కాబోలును.

పుష్ప—నాకు పెళ్లివారు వచ్చినందులకే గర్వమయినచో నీకు పెండ్లి యయి నందుల కెంత గర్వముండవలెను?

సుబ్బ—అంత కోపపడకో. పెండ్లికొడుకు ఎర్రగ నున్నాడా? చామన చాయగ నున్నాడా? నాతో చెప్పినంతమాత్రమున ఎవ్వరితోడను చెప్పనులే.

పుష్ప—మీ ఆయనకంటె ఒకిచాయ ఎరుపే. నాదగ్గరనా నీకబుర్లు? అయితే మీ ఆయనను మొన్న పండుగకు తీసికొని రాలేదేమి?

సుబ్బ—పోనీలే. నీ కంతకోపమయితే మరియొకమాట మాటాడు కొందము. నీకు పెండ్లి అయిన తరువాతకూడ మీవాళ్లు హిందీ చదువుకొన నిచ్చెదరా?

పుష్ప—నిన్ను మీవాళ్లు చదువుకొననిచ్చినపుడు నన్ను మావా ళ్లెందుకు చదువుకొన నియ్యరు?

సుబ్బ—ఏమాటనినను నీకు వెటకారమే. పోనీ. మనపరీక్షాఫలితము లెప్పుడు వచ్చునో?

పుష్ప—నేడో రేపో వచ్చునని అమ్మగారు చెప్పినారు. అమ్మగారికి మనకంటెను ఆత్రతగ నున్నదిసుమా!

సుబ్బ—పాపము! రాత్రింబవళ్లు అదేపనిగ కష్టపడి చెప్పినారు. ఆత్ర తగ నుండదా?

పుష్ప—మా అమ్మను చూచిన కంటె అమ్మగారిని చూడగనే నా కదేమో ఆప్యాయముగ నుండును—ఇదిగో నిన్ను ఎన్నాళ్లనుం డియో అడుగవలె నని అనుకొను చున్నాను. అమ్మగారి మొగ మెప్పుడును చిన్నబోయి యుండు నేమి?

సుబ్బ—(రహస్యము నటించుచు) ఇదిగో! ఆవిడ మగడేమి నాట కములాడుటకు ఇంగ్లండు వెళ్లినాడట. మూడేళ్లయినది. ఇంకను రాలే దనిబెంగ.

పుష్ప—అమ్మకోసము నాన్నకోసము బెంగపెట్టుకొందురు గాని మగ నికోసము బెంగపెట్టుకొందురా?

సుబ్బ—ఇంకను పెళ్లికానిదానవు నీకేమి తెలియును?

పుష్ప—అందుకే పెళ్లిఅయిన పెద్దపేరక్కవు. నిన్నడిగినాను. చెప్ప రాదా?

సుబ్బ—దానికేమిగాని అమ్మగారు సాక్షాత్తు లక్ష్మీదేవి వలె నుండు నో. పూజచేయుచుండగ చూడవలెను. నిజముగ ఆ మొగము ఎంత కలకలలాడుచుండును?

పుష్ప—అమ్మగారికి పిల్లలు లేరా?

సుబ్బ—లేకేమి?

పుష్ప—ఎక్కడ నున్నారు?

సుబ్బ—మన మందరము ఆమె పిల్లలము గామా? మనల నావిడ కన్న బిడ్డలవలె జూచుకొనుచుండుట లేదా?

పుష్ప—నిజమేలే. అదికాదు కడుపున బుట్టిన పిల్లల మాట—

[రామసీత అను బాలిక ఆంధ్రపత్రిక చేతబట్టుకొని ప్రవేశించును]

రామ—ఇదిగో! సుబ్బలక్ష్మి! పరీక్షాఫలితములు వచ్చినవో నీవు ఫస్టుక్లాసులో ప్యాసయినావు.

సుబ్బ—పుష్పవల్లి ప్యాసయినదా?

రామ—పుష్పవల్లీ! నీనంబ రెంత?

సుబ్బ—195.

రామ—(చూచి) పుష్పవల్లి కూడ ఫస్టుక్లా సేనో! మనస్కూలులో విశారదపరీక్షకు పోయిన వారొక్కరును ఫెయిలు కాలేదు. అయిదు ఫస్టుక్లాసులు!

పుష్ప—రాష్ట్రభాషాపరీక్షలోనో?

రామ—రాష్ట్రభాషాపరీక్షకు పోయిన వారందరు మొద్దమ్మాయిలు. అక్కడికిని అమ్మగారి తరిఫీదు గనుక ఒక్కరును ఫెయిలు కాలేదు. కాని ఫస్టుక్లాసులు లేవు.

పుష్ప—పోనీలే. ప్యాసయితే చాలు. ఫస్టు క్లాసులతో కూరవండు కొనెదరా యేమి?

సుబ్బ—ఈ సంతోషవార్త అమ్మగారికి చెప్పవలదా?

రామ—ఆమె యిదివరకే పత్రిక చూచి యుండును. (ఒకటి రెండడుగులు నడుచుట నభినయించి) అరుగో! అమ్మగారు స్వాముల వారితో నేదో మాటాడుచున్నారు. వారు వెళ్లిపోయిన తరువాత మనము ప్రవేశింతము. (అని ప్రక్క కొదిగియుందురు. తెరయెత్తగ రాజ్యలక్ష్మి బ్రహ్మానందస్వామి ప్రవేశింతురు.)

బ్రహ్మ—ఆరునెలల క్రితము చనిపోయిన అత్తగారి నిమిత్తమయి విలపించు నీవంటి కోడండ్రు ఇక ముందుయుగమున నెక్కడనయిన జన్మింప వలెనేమోకాని ఈయుగమున లేరు.

రాజ్య—స్వామీ! ఆమె నా కత్తగారి వలె లేరు. మాతల్లిగారి కంటెను ఎక్కుడు అవ్యాజానురాగము వర్షించువారు. నిజముగ ఈమూడేండ్లనుండియు నే పడుచున్న యవస్థకు అట్టి మహాతపస్విని యాశ్రయమే లేకుండినచో ఈసరికి గుండెపగిలి చావవలసిన దే.

బ్రహ్మ—కోడలివలన నిట్టి యోగ్యతాపత్రికను గొనజాలిన యత్తగారి నెంత స్తుతించినను స్తుతింపవలసిన దే. ఆమె మరణవార్త మీవారికి తెలియునా?

రాజ్య—ఎక్కడ నున్నా రని వ్రాయను?

బ్రహ్మ—ఈనడుమ నేదో నమెరికాలో షికాగో నగరమున 'నటచక్రవర్తి' బిరుద మిచ్చినట్లు పేపర్లలో బడిన దే.

రాజ్య—ఆషికాగోనగర మెంతపెద్దనగర మో? అక్కడ నీయన అడ్రెస్సెమో?

బ్రహ్మ—బాగుగనే యున్నది. సూర్యచంద్రులు ఇంటిలో వసించుచుండగ శీతాతపముల కాగని ప్రాతయింటిలో నిక్కడ నీనివాసమా? ఆకాశమును చీల్చుకొని హిమవత్పర్వతములవలె నున్నతములయిన సౌధాగ్రములపయి నాయననివాసమా? పూటకు గతిలేక ఇక్కడ నీవు హిందీబోధనమా? అమెరికా ప్రెసిడెంటుచే నభినంద

నము లందుకొనుచు హాలీవుడ్డులో నాయన యుపన్యాసములా? భార్యాభర్తల నడుమ బ్రహ్మ యెంతవ్యత్యాసము నిరూపించుచున్నాడు !

రాజ్య—నాకయి నే నంత చింతింపను. ఎన్ని బిరుదములు సంపాదించి నను ఎంత ఇంద్రభోగ మనుభవించుచున్నను కన్నతల్లి ముప్పు గడపక పరమునకు దూరులైనారుగదా? స్నేహలతతోడి సాంగత్య మింతవరకు దెచ్చినది.

బ్రహ్మ— స్నేహలత యెవరు?

రాజ్య—ధనికురాలగు బాలవితంతువు.

బ్రహ్మ—ఏకులము?

రాజ్య—బ్రాహ్మణకులమే. బి. యే. ప్యాసయినది. ఇంగిలీషు చకచక మాటాడగలదు. వెనుక నెవ్వరును లేరు. దేవదేవీపాత్రమును ధరించి ఆవిడ— విప్రనారాయణపాత్రమును ధరించి ~~ఈయన~~— మొట్టమొదట నీయూరిలోనే నాటకరంగమున సమావేశ మయినారు. అది మొదలు—

బ్రహ్మ—ఇప్పటికి తెలిసినది. నీభర్తగారికి నాట్యకళయందు విపరీత మయిన యభిమాన మగుటచేతను ఆమెకుకూడ దానియం దట్టి యభిమానమే యుండుటచేతను ఆమెవలలో బడినారు. ఇది మీ సంసారవిచ్ఛిత్తికి మూలహేతువు.

రాజ్య—చిత్తము. తమరు బాగుగ గ్రహించినారు. మామయ్యగారు పోయినను పెద్దలగు మీ పాదసేవ లభించుటవలన ఎట్లో దినము లీడ్చుచున్నాను. ఇక్కడ తమ రాశ్రమము నిర్మించుకొనుట నా పూర్వపుణ్యఫలమే.

బ్రహ్మ—తల్లీ. నీవంటి సాధ్వీమతల్లుల సంవాసముచే నీపురము మావంటివారికిగూడ సంసేవ్య మగుచున్నదిగదా! అదిగో! పాత

శాలకు బాలికలు వచ్చి నట్లున్నారు. నాకును మాధ్యాహ్నికము లకు వేళయగు చున్నది. ధైర్య మవలంబింపుము. త్వరలోనే మంచి రోజులు రాగలవు— (నిష్క్రమించును)

[స్వామి నిష్క్రమింపగనే బాలికలు ఎదుటకువచ్చి]

బాలి—అమ్మగారండీ! హిందీపరీక్షాఫలితములు వచ్చినవి.

రాజ్య— చూచినాను. మీ రందరును బాగుగ ప్యాసయినారు.

[ఇంతలో మరికొందరు బాలికలు వచ్చి నమస్కరింతురు.]

రాజ్య—మీ రందరును పరీక్షలో కృతార్థు లయినందులకు సంతోష సూచకముగ నేటికి సెలవు. భారతమాతకు మంగళము పాడి ఎవరియిండ్లకు వారు పొండు. ఈదినము సెలవని మీకెదురుగ వచ్చిన బాలికలతో గూడ చెప్పుడు.

(బాలికలు ఉచ్చైస్స్వరమున ఏకకంఠముతో నీక్రిందిగీతమును పాడుదురు. పాట కనుగుణముగ కోలాటము వేయించినను వేయింప వచ్చును.)

హిందీ పాట

జయతు జయతు జనని! ప్యారీ! భువనమానసహారిణీ!
జయ హమారి దివ్యధాత్రీ! పతితపావని! భారతీ!
ధాత తేరా చరణతలమ్హై నీలనీరధినీరసే
జయ అనలకంపితమనోహరశ్యామ అంచలధారిణీ॥ జయతు॥
వ్యోమచుంబీఫాలహిమగిరి హై తుషారకిరీటహై
జయతు లక్ష్మీస్వరూపా! దైన్యదుఃఖనివారిణీ॥ జయతు॥
జాహ్నవి యమునాస్కలితహై తవస్తన్యామృతరసనే
గోదావరీకృష్ణానదీ విమలతా విస్తారిణీ॥ జయతు॥
జయ మహాత్మగాంధితిలకప్రభృతిపుత్రోద్ధారిణీ!
జయతు భారతీయోంకో సుస్వరాజ్యదాయినీ॥ జయతు॥

రాజ్య—(పాట ముగిసిన వెనుక) ఆహా !

గీ. మండు వేసంగిగాడ్పున గ్రుగ్గి గ్రుగ్గి
ఎండిపోవుచు నున్న నా హృదయలతకు
స్వాదు భవదీయగానవర్షోదయంబు
వెండియు చిగుర్చు భాగ్యంబు వెలయజేసె.

ఉ. బాలికలార! మీ నలెనె పాడుచు హాయిగ లాస్యనైపుణీ
ఖేలన మాచరించుచు సఖీజనసంగతి నెన్నడుంటినో!
కాలము మారిపోయి యిటు కష్టపిశాచము నోటజిక్కి కా
కోలవిషానలార్చులకు గుందుచు నుంటిని భాగ్యహీననై.

గీ. ఘోరదారిద్ర్య మెరుగరు: కూర్మిభర్త
కఠినవర్తన మెరుగరు: కాలసర్ప
భయదదంష్ట్రావితానసంస్పర్శ మెరుగ:
రాదుకొను డమ్మ నిశ్చింత నాడుకొనుడు.

బాలికలు—మాతాజీ. సెలవు. (నిష్క్రమింతురు. తెరపడును.)

---

## మూ డ వ ర ం గ ము

ప్రదేశము—విద్యాపురములోని టవునుహాలు
సమయము—సాయంకాలము 4 గం॥

[ప్రవేశము—పెద్దసభ అధ్యక్షపీఠముపయి శంకరరావు (పూలదండతో) ఉపన్యాసకులు, శివశంకరపాండ్యా, గుండురావు, కర్కోటకశాస్త్రి, కార్యదర్శి సుదర్శనరావు కొందరు సభ్యులు ]

శంక—ఆర్యులారా! నేటిసభకు అధ్యక్షత వహింపవలసిన కలెక్టరు గారు కారణాంతరములచే రాజాలనందున వారిస్థానే నా కావదవి నిచ్చి గౌరవించి నందుల కెంతయు కృతజ్ఞుడను. శ్రీజగన్మోహన

రావుగారికి నటచక్రవర్తి బిరుద మిచ్చి గౌరవించినందులకు అమె రికాఖండము పట్ల మనపురవాసులు తమకృతజ్ఞతను వెల్లడించు టకును జగన్మోహనరావుగారి నభినందించుటకును ఈసభ సమా వేశ మయినట్లు మీ కెల్లరకు విశదమే. శ్రీ జగన్మోహనరావుగారి గుణగణమును గూర్చియు ఈ సభాప్రయోజనమును గూర్చియు ఆంధ్రోపన్యాస కేసరి బిరుదాంకితులగు శ్రీ శివశంకరపాండ్యాగారు లఘువుగ ముచ్చటింతురు. (అని కూర్చుండును.)

శివ—(ఉపన్యాసపీఠ మెక్కి) నాయనలారా! రంగదుత్తుంగతరంగ భంగంబులు చెంగలించు సంగతోత్తుంగమాలాశృంగభృంగం బగు రత్నాకరంబు చందంబున చెలువొందు నీ సభారంగంబున నల్లి బిల్లిగనల్లుకొనిన వల్లీమతల్లుల వెల్లువ చందంబున నిల్లు వదలి, రెల్లు వదలి, బెల్లు వదలి, చిల్లరదుకాణంబుల వదలి యెల్లరును ఇచ్చోటికి విచ్చేసి, కచ్చేరి గావించి, నావంటి కించిజ్ఞుని కొంచెపరు పక మంచితనంబునకు మించుటద్దములవలె నలరు మీముఖార విందంబుల నందగింప జేయు చిరునవ్వుపువ్వులమవ్వంపుబంతుల దొంతరదొంతరలుగ రివ్వురివ్వుమని గువ్వలచందంబున నాపయి విసరుచున్నారు గదా! (సభలో కరతాళధ్వనులు) (ఉపన్యాసకుడు అధ్యక్షునివంకకు దిరిగి) అయ్యా, ప్రచండముగ మండుకొనివచ్చు నుత్సాహాతిరేకమున నో రెండిపోవుచున్నది. ఈమలేని సోడా నొకదాని నిప్పింపుడు.

సుదర్శ—(సోడా నిచ్చును. పాండ్యా త్రాగుచుండును.)

మొదటిసభ్యుడు—ఇదేమి ధోరణిరా బాబు! రామరామ! ఈశైలి రాళ్లు విసరుచున్నట్లున్నది.

రెండవసభ్యుడు—అర్థమున్నదా లేదా యను విచారణ మన కక్కర లేదు. ఆపదముల యమకమునకు సంతసింపవలెను.

శివ—(సగముసోడా త్రాగి) మరియు మన యభాగ్యవశంబున నేడు భాగ్యుండును భోగ్యుండును మృగ్యుండును నగు సధ్యక్షుని సమక్షంబున రూక్షంబగు వీక్షణంబుల ప్రోక్షించి ప్రేక్షకుల మనంబుల నిక్షుఖండంబుల భక్షించిన చందంబున శిక్షింపవలె నని మదీ యాశయంబు. కాని రక్షకుండగు సర్వేశ్వరుండు మక్షికమువలె కుక్షిలోపల లక్షలకొలది జీవరాసుల నిముడ్చి —

శంక—ఎంతసేపటికి, డొంకతిరుగుడు ధోరణి మాని, అసలు విషయమునకు రాకుండ నున్నారు. మీ కింకొక్క నిముషము మాత్ర మిచ్చుచున్నాను.

శివ—మాయిరే? హాయిగ నేయి వోలె ప్రవహించు నా యుపన్యాసంబువిన్యాసంబు సన్యాసంబుగా నెంచి నన్నిచ్చటకు ముచ్చటదీర జనంబులు మెచ్చ —

శంక—మహాజనులారా! వీరి యుపన్యాసము ముగిసినట్లే యెంచవచ్చును.

శివ—ఎంచవచ్చు నని మంచిచెడ్డ లరయక సభారంగమునుండి నన్నుదించవలెనని తలంచుచున్న నిన్ను పత్రికలలో దంచెదను. (అని కోపముతో దిగిపోవును.)

శంక—అయ్యా! వక్తృత్వవాచస్పతులు! మీ రాగ్రహించినచో నే నాగగలనా? మహాజనులారా! ఇంతకును వీరు ప్రతిపాదింప వలసిన తీర్మానమును ప్రతిపాదింపనేలేదు. "శ్రీజగన్మోహనరావు గారికి నటచక్రవర్తి బిరుద మిచ్చి గౌరవించినందులకు ఆంధ్రదేశము తరఫున ఈపురవాసులు అమెరికాఖండముపట్ల తమ కృతజ్ఞతను ప్రకటించుచున్నారు." అను తీర్మానమును నేను ప్రతిపాదించుచున్నాను. ఇది మీకందరకు నంగీకారమేనా?

సభలో—అంగీకారమే (యని కేకలు.)

శంక—తరువాతి తీర్మానమును శ్రీయుత కె. గుండురావుగారు ప్రతిపాదించెదరు.

[ గుండురావు ఉపన్యాసవేదిక నెక్కును ]

మొదటిసభ్యుడు—గుండురావుకాదురా బాబూ! ఈతడు గుండిగరావు.

రెండవ స॥—నాలుగుగుళ్లు బరువుగల కాటాబస్తాతో సరితూగగలడు. అందుచే గుండురా వనుట యుక్తముగనే యున్నది.

మొ॥స॥—ఎంతసేపును మీసములు మెలిపెట్టికొనుటతో సరిపోవుచున్నది కాని నోట మాటరాదేమి?

[ గుండురావు గర్రు మని త్రేన్చును. ]

రెం॥స॥—పల్లెటూరిపశువు వలె నుపన్యాసపీఠ మెక్కి త్రేన్చుచున్నా డేమి?

మొ॥స॥—మధ్యాహ్నము రెండువీశల ఉప్మా ఫలాహారప్రాయముగ పట్టుపట్టినాడు. అరగవలదా?

రెం॥స॥—(బిగ్గరగా) విగ్రహాపుష్టి నై వేద్యనష్టి. ఏమయినను మాటాడదలచుకొన్నావా? లేదా?

గుండు—(మీసములు మెలివెట్టికొనుచు) వచ్చుచున్నాను.

మొ॥స॥—ఎక్కడకు?

రెం॥స॥—నీవు వచ్చుచున్నావో లేదో నాకు తెలియదు గాని నిన్ను—భూగోళ మంత పరిమాణము గల నీపొట్టను — చూడలేక మేము చచ్చుచున్నాము.

గుండు—(మీసములు గువ్వుకొనుచు) మహాజనులారా! "ఈతీర్మానమును నీవు ప్రతిపాదింపవలె" నని చెప్పి ఏదోయొక తీర్మానమును కాగితముమీద వ్రాసి క్లబ్బుశెక్రటరీగారు నాచేతి కిచ్చినారు?

మో॥స॥...అయ్యయ్యో. అదే మది? అలాగున చెప్పివేయుచు న్నాడు?

గుండు——అసలు ఉపన్యాసము లనగనే మనకు భర్జింపవు. ఏమయినను పాతిక ఇడ్డెనులు భక్షింపు మని కోరినచో శక్తివంచనలేక పని చేయగలను గాని ఇటువంటి యుపన్యాసములలో "అహమస్మి" అని ముందుకువచ్చు దౌర్భాగ్య స్వభావము నాయొద్ద లేదు.

రెం॥స॥——నీతల్లికడుపుచల్లగ నిజము చెప్పినావు.

గుండు——అయితే నాకర్మము చాలక నాగ్రహచారవశమున ఉప న్యాస మీయవలసివచ్చినది. శెక్రటరీగారు వ్రాసియిచ్చిన తీర్మా నమును పైకిచదివెదను. ఇందులో రహస్య మే మున్నది?

"శ్రీజగన్మోహనరావుగారిని నవీనపద్ధతులపయి నొక నాటక సంఘమును స్థాపించుటకయి హిందూదేశమునకు రమ్మని కోరుచు, ఆయుద్యమమును ప్రోత్సహించుటకు వారికి ఆంధ్రదేశమునుండి అరువదివేలరూపాయలు ప్రోగుచేసియిచ్చుటకు ఈక్రిందివారిని సబ్ కమిటీగా నేర్పరచుటయైనది. (1) యస్. నిక్షేపరెడ్డిగారు, (2) కే. నిశానీచౌదరిగారు, (3) ఆర్. నిషాసాహెబుగారు, (4) జె. నిరక్షరకుక్షిదీక్షితులుగారు.

మో॥స॥——ఓహోహో! ఎటువంటి మహాత్ములను వెదకినారయ్యా!

గుండు——ఇక్కడకు నాచేతి కిచ్చిన తీర్మానమును నేను చదివినాను. నాపని అయిపోయినట్లే లెక్క.

రెం॥స॥——తథాస్తు! తథాస్తు!

గుండు——కాని ఈ తీర్మానమునకు అనుకూలముగ మాటాడవలెనను తలంపు నా కెంతమాత్రమును లేదు. ఒకటి. నవీనపద్ధతుల మీద నైనను ప్రాచీన పద్ధతుల మీద నైనను నాటకసమాజములు

నిరుపయోగము లని నా తాత్పర్యము. ఇప్పటికి నా కేబదియేండ్లు వచ్చినవి. ఒక్కనాటకము చూడలేదు. ఒక్కసినీమా చూడలేదు.

మో॥స॥—లండనుమ్యూజియములో నుంచవలసిన వ్యక్తిరా బాబు!

గుండు—నోటి కడ్డము వచ్చినదా? చేతి కడ్డము వచ్చినదా? నేను జిల్లాబోర్డుప్రెశిడెంటు పని అవిచ్ఛిన్నముగా ఆరేండ్లనుండి చేయుట లేదా? ఈ నాటకముల వలన దేశమంతయు పాడయి పోవుచున్నదని నా యభిప్రాయము. నాటకములు చూచినచో రాత్రి నిద్దుర లేక అజీర్ణము. ప్రొద్దుననే టిఫిను సరిగా సహించదు. ఉన్న నాటక సమాజముల సన్నిటిని నిలుచున్నపాటున భస్మము చేయవలసిన దని నేనే మంత్రి నయినచో ఈసరికి శాసనము గావింపకపోతినా?

శంక—ఇదే మయ్యా మీతీర్మానమునకు మీరే వ్యతిరేకముగ మాటాడుచున్నారు?

గుండు—దత్తపుత్రశ్లోకము కాకపోతే, శెక్రటరీ వ్రాసి నాచేతిలో బెట్టిన తీర్మానము నాతీర్మాన మెట్లయినది? ఇంకొకటి. ఒడలు పొగరెక్కి కాకిపోయినచో వారమునకుపది వేలపౌను లార్జించు వానికి మనము ధనము ప్రోగుచేసి యిచ్చుట యెందులకు? ఇంక ఈ సబుకమిటీలో సభ్యులుగ నున్నవారిని గూర్చి వేరే చెప్ప వలెనా? ప్రోగుచేసిన సొమ్ము ఎన్నటికి జగన్మోహనరావుగారికి చేరనీయకుండ జాగ్రతపరుపగల దిట్టరులు -

శంక—అయ్యా, మీరు వ్యక్తిదూషణకు గడంగుచున్నారు. అసలు విషయము మరచిపోవుచున్నారు.

గుండు—ఏతావాతా, చెప్పదలచుకొన్న విషయ మే మనగ జగన్మోహనరావుగారు విస్తారముగ విదేశయాత్ర సలిపినవారు గనుక, అందును రసగ్రహణపారీణులు గనుక, నవీనపద్ధతుల ననుసరించి క్రొత్తక్రొత్త భక్ష్యములు తయారుచేయించుట కొక కాఫీహోటలు

స్థాపింపవలసినదిగ కోరుచు దానికి ధనము ప్రోగుచేసి యిచ్చుటకు నన్ను సబ్ కమిటీ కధ్యక్షునిగ నిర్ణయించినచో—ఇదిగో ఇప్పుడే పాతికరూపాయలు పద్దు వేయుచున్నాను.

మో॥స॥—ఎంత రసాభాసముగ నుండవలెనో అంత రసాభాసముగ నున్నది.

శంక—అయ్యా, ఇంక మీరు దిగవచ్చును.

గుండు—అదేమి? అంత లఘువుగ మాటాడుచున్నారు? నే నేమి పాతికతులముల యెత్తయినను లేని పాండ్యా ననుకొంటిరా? న న్నీయుపన్యాసపీఠమునుండి దించుటకు పెద్దలు దిగిరావలెను.

శంక—(తనలో) ఈసభాధ్యక్షపదవికంటె చాకలిపని మెరుగు. (ప్రకాశముగా) మిమ్ము బలాత్కారముగ దింపవలెనని నాయుద్దేశము కాదు. మీ రింకొక రెండుగంటలు మాటాడినను నాకభ్యంతరము లేదు. కాని జిల్లాజడ్జీగారికి బదిలీ అయినందుల కవతల టీపార్టీ యొకటి యున్నదిగాదా? అది మించిపోవునేమో యని నా భయము.

గుండు—ఆలాగున నన్నారు. బాగున్నది. (అని దిగిపోవును.)

శంక—పిమ్మట శ్రీ కవిశుంఠ కర్కోటకశాస్త్రి గారి అభినందనపంచరత్నములు; పద్యములు మాత్రమే చదువవలెను. ఉపన్యాసము పనికిరాదు.

మో॥స॥—ఇదేమి క్రొత్తబిరుదోయి? "కవిశేఖర" "కవిచక్రవర్తి" "కవిరాజ" ఇత్యాది బిరుదులు వినుచున్నాము గాని "కవిశుంఠ" యనుబిరుదు నేకవియు ధరింపగ వినలేదే? ఇది చిత్రముగనే యున్నది.

రెం॥స॥—అనగ తక్కిన కవులందరును ఈయనముందు శుంఠ లయిపోయి ఈయన యొక్కడే ప్రకాశించుననని యర్థము. బహువ్రీహి సమాసము.

మో॥స॥——అపరమల్లినాథసూరివి! నీ వ్యాఖ్యానము నీకే యర్థము గావలెను.

కర్కోటకశాస్త్రి:——(ఉపన్యాసపీఠ మెక్కి కంఠము సవరించుకొనును.)

మో॥స॥——కంఠము సవరించుకొను చున్నాడు. బాగుగ పాడగలడా యేమి?

రెం॥స॥——తినబోవుచు రుచి యడుగనేల?

కర్కో——(వికృతస్వరముతో)

మ. శ్రీకరంబుగ సర్వసద్గుణసేవ్యమానకిరీటివై
సేకరించితి నాట్యశేముషి సీమలెల్లను మెచ్చగా
కాకిమూకల లోని కోకిలకందువోచు వెలుంగవే
ఏకలవ్యుని మించుచున్ జగదేకకీర్తివి మోహనా!

మో॥స॥——నమః పార్వతీపతే! భోజనకాలే గోవిందనామస్మరణ. గోవిందా (అని బిగ్గరగ నరచును.)

రె॥స॥——ఛీ. ఛీ. అల్లరిచేయకుము. అసలే సభ నడుపలేక శంకరరావు గారు గిజగిజ కొట్టుకొనుచున్నారు.

మో॥స॥——ఆలోచించి మరిచెప్పుము. ఆస్వరమేమి? ఆ వాలకమేమి? ఏమి శ్రాద్ధయోగ్యముగనున్నది! దానికితోడు కాలితో తప్పు తాళము వేయుచున్నాడు.

కర్కో——అయ్యా! ఇందులోని అలంకారము మాత్రము రవంత స్పష్ట పరచెదను.

శంక——పనికిరాదు. త్వరగ పద్యములు చదువుడు.

రెం॥స॥——తెనుగుకవి లోకువగనుక ఆలాగున గద్దించుచు మాటాడు చున్నాడు.

మో॥స॥——పాపము! శాస్త్రులు బిక్కమొగము వేసినాడు.

కర్ణో—

మ. ప్రాకటంబుగ నాంధ్రదేశపు ప్రాక్తనాంచితపుణ్యముల్
రేకులెత్తిన యట్లు జృంభిత రీతి నేడు వెలింగెడున్.
మోకరిల్లిరి పశ్చిమంబున ముగ్ధులై బహుపండితుల్.
నీకు మంగళహారతిచ్చిరి నృత్యమాడుచు నంగనల్.
అంటే...

శంక—"అంటే" అని యికవ్యాఖ్యాన మారంభింతురు కాబోలు. పనికిరాదు.

కర్ణో—పనికిరాకపోయినచో నా "పంచరత్నములు" సవ్యాఖ్యానముగ పత్రికకు బంపెదను గాని ఇక్కడ చదువనే చదువను. కచేరీ తొందరలో తద్దినపుతంతువలె జరగించినచో నాకు పనికిరాదు.
(అని దిగిపోవును.)

మొ॥స॥—దిగిపోయినాడో బ్రతికించినాడో. గార్దభస్వరముతో నైదు పద్యములు కాదుగదా ఒక్కపద్యము కూడ వినలేకుండ నున్నాము. దానికితోడు వ్యాఖ్యానము కూడనా?

శంక—కవిత్వము పసందుగ నున్నను సభచాల యల్లరిగ నుండుటచే వ్యాఖ్యానము చేయనిచ్చుటకు వీలిచ్చినది కాదు. అంత్యోపన్యాసము పేరుచెప్పి నేనుకూడ ఏమియు మాటాడదలచుకొన లేదు. సభ నింతతో ముగించుచున్నాను.

[అంతట వందనసమర్పణమునకయి కార్యదర్శి సుదర్శనరావు ఉపన్యాసపీఠ మెక్కి]

సుద—(నత్తితో)అ...అ...య్యలారా ఉగ్రాసనాధిపత్యము వహించిన

సభ్యులు—ఉగ్రాసనాధిపత్యము కాదు. అగ్రాసనాధిపత్య మయ్యా.

సుద—త...త...గవేమున్నది? వహించిన...వహించిన భీమసేనరావునాయుడు గారికిని.

సభ్యు—భీమసేనరావునాయడుగారు కాదు. శంకరరావుపంతులుగారు.

సుద—స...స...సంకరరావు పంతులుగారికిని ఉపసన్యసించిన.

సభ్యు—నీతప్పులు దిద్దలేక చచ్చుచున్నాము. బాబూ మమ్ములను చంపక నీవింతతో దిగు.

సుద—అందరకు మనస్కారములు.

మొ॥స॥—అసలే అపండితశిఖామణి. దాసిమీాద సత్తి. అందుపై సభాకంపము. వందనసమర్పణామైనను చేయలేనివారికి శెక్రటరీ పదవి యెందులకో? జడ్జీగారి నాశ్రయించుకొనిన జంబుకము కావున వీనిని తీసివేయుట కెవ్వరికిని అధికారము లేదు కాబోలును.

(తెరపడును.)

---

# రా జ్య ల క్ష్మి



## మూడవ అంకము.



### ఏ క ర ం గ ము

ప్రదేశము—రాజ్యలక్ష్మి కాపురమున్నయిల్లు

[ ప్రవేశము—రాజ్యలక్ష్మి ]

రాజ్య—ఈశంకరరావు వాలకము బొత్తిగ నసహ్యముగ నున్నది. పూర్ణయ్యగారి మీది గౌరవముచే గుమ్మ మెక్క నిచ్చితిని. వీనిని వదల్చుకొను మార్గమేమా యని యాలోచించుచున్నాను.

[ తెరలో " రాజ్యలక్ష్మి, రాజ్యలక్ష్మి " అని పిలుపు ]

అదిగో ! తలుపు తట్టుచున్నాడు. ఈసారి వీనికి గట్టిగ బుద్ధిచెప్పి మరల నాగుమ్మ మెక్కకుండ చేయవలెను.

[ అని యలమారులోనుండి యొకచిన్నకత్తిని మొలలో దాచి తలుపుతీయుట నభినయించును ]

శంక—[ప్రవేశించి అట్టహాసముతో మీసములు దువ్వుచు] మొన్న కాశ్మీరమునుండి క్రొత్తగ సెంట్లు వచ్చినవి. పంపించితిని. అందినవా ?

రాజ్య—భర్తృవియోగముచే పరితపించు నాకు సెంట్లెందులకు ? వానిని వెంటనే త్రిప్పివైచితిని. మీరింకను చూచుకొననే లేదా ?

శంక—అయ్యయ్యో ! నీ యమాయకత్వము బంగారముగాను ! నీభర్త తిరిగివచ్చు ననియేనా నీనమ్మకము ?

రాజ్య—రానిండు. రాకపోనిండు. ఆగొడవ యంతయు మీకెందుకు?

శంక—అదికాదు. ఏదో మీకుటుంబమనినను నీవనినను రవంత యభిమానమున్నవాడను గనుక అడిగినాను.

రాజ్య—ఓ! మీ యభిమానము సంగతి నేను కనిపెట్టుచుండుటలేదా?

శంక—అదేమి? నన్నుగూర్చి సందేహపడు చున్నావా? ఇదిగో! జేబులో రెండువేలరూపాయలు వైచుకొని వచ్చినాను.

రాజ్య—మీ రెండువేలరూపాయలు నాకు రెండు గడ్డిపరకలతో సమానము. దానికేమిగాని నన్ను క్షమింపుడు. నాకు మీరెట్టి సాయమును జేయవలదు.

శంక—వట్టి తొందర. ఇప్పటి కారులో నున్నదే యిది. వెనుకముందులు లేవు. మంచిచెడ్డలు లేవు. చూడు! నీభర్త అమెరికాలో తొమ్మిదియంతరువుల భవన మొకటి కొని అందు కొందరు నటీమణులతో విహరించు చున్నాడట—ఆతడు మరలి మనదేశమునకు వచ్చునను నమ్మకము నాకులేదు.

రాజ్య—ఆగొడవ మీ కెందులకు? నేను చేసికొనిన సుకృతమో దుష్కృతమో నేనే యనుభవించెదను.

శంక—పిట్ట కొంచెము! కూత ఘనము! సుకృతము...దుష్కృతము...అబ్బో. ఎంతెంత పెద్దకబుర్లు? దినమున కక్షరలక్షలు అష్టాక్షరి జపించుచున్న మాబోటులకు దిక్కులేదు. చిలుకపలుకులు!

రాజ్య—మీరు అనవసరముగా లేనిపోని చనవు తీసికొనుచున్నారు. మీ వాలకము బొత్తిగా బాగులేదు. ఏబదియేండ్లు దాటిన వృద్ధులు ఈలాగేనా సంచరింపవలసినది?

శంక—ఏబది యేండ్లకే వృద్ధాప్యమా? ఏమి వింతగ మాటాడు చున్నావు? దంత మొక్కటి యైనను కదలలేదు. జుట్టుకు రంగు

వేసికొనవలసిన యవస్థ కలుగలేదు. భోజనపుష్టి యేమాత్రము తగ్గలేదు. నన్ను వృద్ధుడని యనినచో సరిపోయినదా? మంచి నడివయస్సు! ఇరువదియైదేండ్లు నిండలేవు—ఇంత వేదాంతము ముదిరిన నీవుకూడ నన్ను వృద్ధుడని హేళన చేయుటయేనా? ఇదిగో! సురాజ్‌మల్ కంపెనీనుండి క్రొత్తగ రవ్వల యుంగరము తెప్పించినాను చూచినావా?

రాజ్య—నాకు తెలియక యడుగుచున్నాను. ఇదేమి వేశ్యాగృహ మనుకొంటిరా?

శంక—అంత తొందర యెందులకమ్మా? నానోట పల్లెత్తు మాటయైనను వచ్చినదా? ఏమాటయైనను నీవే యనుకొనుచున్నావు. ఎందుకా మాటలు? నీవు భక్తురాలవు. నేను తపస్సిద్ధుడను. మన యిరువురను అనుమానించుటకు లోకమున కెన్ని వేలగుండె లుండవలెను? అందుచేత నీవు సంకోచపడవలదు. పతివ్రతవని నీకున్న కీర్తికి భంగము రాకుండగనే మనము వ్యవహరింపవచ్చును—

రాజ్య—మీ కుయుక్తులు చూడగ నాకు పరమాసహ్యముగనున్నవి. మీరు తక్షణమే యావలకు దయచేయుడు.

శంక—ఆఁ. ఎంతమాట అన్నావు? పిన్న పెద్ద తారతమ్యము లేకుండ నెంతమాట యన్నావు?

రాజ్య—మీమాటలు వినగ నాకు తలనొప్పి వచ్చుచున్నది.

శంక—అయితే అమృతాంజనము రాచుకో. అంతేకాని ఘరానా మనిషిని యింటిలోనుండి యావలకు బొమ్మని మర్యాదహీనముగా మాటాడెద వెందులకు?

రాజ్య—ఈ పరిహాసములు కట్టిపెట్టి ఆవలకు పోయెదరా? లేదా? ఒక్కమాట అడుగుచున్నాను.

శంక—(కనులెఱ్ఱజేసి) సుందరీ! శంకరరావు మహిమ తెలియకుండ మాటాడుచున్నావు. శంకరరావు జిల్లాజడ్జీలను చతురంగపుబంట్ల వలె నాడించినాడు. శంకరరావు కోపమునకు గురియైన జమీం దారులు ఫకీరు లయినారు. సుడిగుండములోబడి యీవలకు వచ్చుటయైనను సుకరము గాని శంకరరావు పన్నిన వ్యూహమును భేదించుకొనివచ్చుట బ్రహ్మతరముగాదు.

రాజ్య—అయ్యా, మీ బెదరింపులకు నేను బెదరుదానను గాను. తండ్రి వంటివా రనినమ్మి మిమ్ము నాగుమ్మ మెక్కనిచ్చుట నాదేతప్పు.

శంక—ఒకతప్పున కింకొక తప్పు జోడించినచో రెండును కలసి ఒప్పు లగును. నీవు నన్ను వరించి యొప్పులకుప్పనగుము.

రాజ్య—మురికికుండు కాని నీది నోరుకాదు. ఉపేక్షించినకొలది మితిమీరిపోవుచున్నావు. అట్టె ప్రేలకుము. నోరుమూయుము.

శంక—అబ్బో. పాకము ముదిరినదే. ఇప్పుడు నిన్ను బలాత్కరించి నచో నెవరుదిక్కు?

రాజ్య—మూఢుడా. నీకును నాకును నడుమనున్న ఈమూడుగజముల దూరములో ముప్పదిమూడుకోట్ల దేవతలు నా కంగరక్షకులుగ నున్నా రని యెరుగవా?

శంక—ఏదీ చూతము. (అని ఒక్కడుగు ముందుకు వేయును.)

రాజ్య—దేవతలవరకు పోనేల? నామానమును నేనే రక్షించుకొన గలను. (మొల నున్నకత్తిదూసి) ఇంకొ క్కడుగు ముందుకు బెట్టి నచో నిన్ను హతముచేయుదును జాగ్రత్త—

శంక—(తనలో) ప్రాణము మీదికి దెచ్చుకొంటిని. ఉపాయముతో తప్పుకొనవలెను. (ప్రకాశముగా చిరునవ్వుతో) భర్తృవియోగము వలన నీలో నేమయిన మార్పున్నదేమో పరీక్షింప నెంచితినిగాని నిజముగ నిన్ను బలాత్కరింప దలచితి ననుకొంటివా? నీయెత్తు

ధనముపోసినను నీవు నా కక్కరలేదు. ఇదిగో నీ పాతివ్రత్యమునకు పారితోషికము. (అని బల్లమీద కొన్నినోట్లు నుంచును.)

రాజ్య—అందిన జుట్టు—అందక కున్నకాళ్లు. నాపాతివ్రత్యమును పరీక్షించుటకు గాని పారితోషిక మిచ్చుటకు గాని నీకేమి యధికారమున్నది?

శంక—ఇక నెందులకు? నిన్ను నేను మెచ్చుకొంటినిగాదా. నీవు సీతకంటె పవిత్రురాలవు. సావిత్రికంటె సమయస్ఫూర్తిగలదానవు. ఝాన్సీలక్ష్మీబాయికంటె సాహసికురాలవు.

రాజ్య—ఇప్పటికి నీతల్లికడుపుచలువచే బ్రతికిపోతివి. ఇక ననవసర పాండిత్యప్రకర్షము గట్టిపెట్టి యావలకుబో. లే. ఆధనమును కూడ తీసికొనిపో.

[అంతట పూర్ణయ్య తెరలోనుండి "అమ్మా, అమ్మా" యనిపిల్చును.]

రాజ్య—తలుపు వేసివచ్చితివా?

[రాజ్యలక్ష్మి యాతనికి తలుపుదీయుటకు (నిష్క్రమించును.)

శంక—పూర్ణయ్య వచ్చుచున్నాడు. ఇదేమిప్రమాదమో. ఆవలకు బోవుటకు మార్గమే కానరాదే.

[పూర్ణయ్యతో రాజ్యలక్ష్మి ప్రవేశించును.]

రాజ్య—ఈయనను పెద్దమనిషి యని నమ్మి ఇంటికి రానిచ్చినందులకు ఎంతదుర్మార్గము తలపెట్టినాడో చూచితిరా?

పూర్ణ—ఏమి? ఏమి చేసినాడు?

రాజ్య—ముందుగ ఆయనను హతముచేసి తరువాత నన్ను హతము చేసికొనవలసిన యవస్థ తెచ్చిపెట్టినాడు.

పూర్ణ—సరిసరి తెలసినది. (ఈలోపుగ శంకరరావు వీధిగుమ్మమువైపు జరుగుచుండును. పూర్ణయ్య ఆతని జుట్టుపట్టుకొనును.]

శంక—పూర్ణయ్యా! నీవు నాకు సహాధ్యాయి వైనందులకు చేయవల
సినపని యిదియా? నేనుచెప్పుమాట వినెదవా? ఊరక తొందర
పడెదవా?

పూర్ణ—నీవు చెప్పనక్కరలేదు. అంతయు నీవాలకమే చెప్పుచున్నది.
ఏకమ్! (అని యాతని దవడమీద వాయించును.)

శంక—నేర్చుకొని పోయినావులే. ఉండవోయి. ఆవల నాకు తొందర
పని యున్నది.

పూర్ణ—ద్వే! (మరల దవడమీద వాయించును.)

శంక—పెద్దమనిషివి. వెనుకముందు లాలోచింప నక్కరలేదా?

పూర్ణ—త్రీణి, చత్వారి, పంచ! (అని వాయించుచుండగ శంకరరా
వాతనిని గిజాయించుకొని పారిపోవును. పూర్ణయ్య ఆతని వెంటబడ
బోవుచుండగా.)

రాజ్య—బాబుగారూ! వలదు. ఆతనిదారి నాతనిని పోనిండు.

పూర్ణ—ఈ నిర్భాగ్యుని ముక్కముక్కలు చేయవలెను.

రాజ్య—పోనిండు. అల్లరిచేయుట మనకుకూడ క్షేమకరముకాదు.
ఇదివరకు జరగిన ప్రాయశ్చిత్తము చాలును.

పూర్ణ—దుర్మార్గుడు. ఎంతపని తలపెట్టినాడు? వీనిమాటలు నమ్మి
నేను మోసపోతిని.

రాజ్య—ఇంతకు మనదినము లిట్లున్నవి. ఆహాహా, సముద్రతరంగము
లకువలె ఈయాపదల కెడతెరపి లేదుగదా? అర్థబలము లేదు.
పరివారబలములేదు. తుద కారోగ్యబలముకూడ చెడుచున్నది.
ఈ అగ్నిగుండమున నెన్నాళ్లో యీకాపురము.

ఉ. రెక్కలు గాలె మంటలకు. రివ్వున పైకెగబారు శక్తిలే.
దొక్కరుడైన సాయపడు నుత్తము డెందును గానరాడు. న

ల్దిక్కులు చూచిచూచి—భవదీయకటాక్షము గాననేరమిన్—
బొక్కుచు నుంటి నెట్లయిన బ్రోవగరమ్మ దయాపయోనిధీ!

పూర్ణ—అమ్మా! నీకొక సంతోషవార్త చెప్పవలెనని వచ్చితిని. ఇంతలో నీ యడావుడి తటస్థించినది.

రాజ్య—అమావాస్యచీకటికి చంద్రోదయమా? నాజీవితమునకు సంతోషవార్తయా?

పూర్ణ—అమావాస్య ఎల్లకాలము ఇల్లుగట్టుకొని కాపురముండునా? చీకటిరాత్రులు పోయి వెన్నెలరాత్రులు రావా?

రాజ్య—ఈజన్మమునకు చూడబోము.

పూర్ణ—నీనాథుడు వారముదినములక్రితమే ఓడదిగి స్వదేశము చేరుకొన్నట్లును ఈనెల 16 వ తేదీని మద్రాసులో జరుగబోవు ఆంధ్ర నాటకకళాపరిషత్తు కధ్యక్షత వహించుట కంగీకరించి నట్లును పేపరులో బడినది.

రాజ్య—నిజమేనా? నిజమేనా?

పూర్ణ—ఇంకొక సంతోషవార్త. నీభర్తయు స్నేహలతయు అమెరికాలో విడిపోయినారు. స్నేహలత యిప్పుడు అమెరికాలో పరమానందస్వామి అను సన్యాసికి శిష్యురాలయి యోగాభ్యాసము చేయుచున్నదట.

రాజ్య—స్నేహలతకు యోగాభ్యాసమా? అయితే యికనేను కవిత్వమారంభింపవచ్చును.

పూర్ణ—మొదటినుండియు ఆమెను నే నెరుగుదును. నిజముగ చాల మంచిపిల్ల. తండ్రి పెద్ద "సోషలు రిఫార్మరు" నని కబుర్లుచెప్పుటయేగాని—భర్తపోయినవెంటనే ఆమెకు వివాహము చేసినచో ఇంత పుట్టిమునిగి యుండదు.

రాజ్య—ఆమెగొడప మనకెందులకుగాని వారిరువురు విడిపోయినందు లకు సంతసింపవలెను.

పూర్ణ—కాని నీనాథు డిప్పుడు "మార్గరెటు" అను నాంగ్లసినీమా నటి యడుగులకు మడుగులొగ్గుచున్నాడట.

రాజ్య—అయ్యయ్యో! నీటిగండము తప్పి నిప్పుగండము దాపురించినదే.

పూర్ణ—అయినను భయము లేదు. మీ సతీపతుల నేకముచేయుటకు మనగురువుగా రొక యాలోచన చేసినారు.

రాజ్య—ఏమి టది?

పూర్ణ—హోమోపతీవైద్యశాస్త్రప్రకారము రోగ హేతు వగుమూలి కనే రోగనివారణార్థ ముపయోగింపవలెను. ఆంధ్రనాటకకళా పరిషత్సమావేశసందర్భమున మనయూరి "లలితకళాసమాజము" వారు సారంగధరనాటకమును ప్రదర్శింపబోవుచున్నారు. అప్పుడు మన మొకచిన్నచిత్రము చేయవలసియున్నది.

రాజ్య—ఏమి టాచిత్రము?

పూర్ణ—స్వామియే నీకు స్వయముగ వివరించి చెప్పగలరు. కానిపనిని వారెన్నడు నాజ్ఞాపింపరు—వా రాజ్ఞాపించినదానిని నీవెన్నడు తిరస్కరింపవు—ఇక నెందులకు? లీలావతికూడా అక్కడకు వచ్చును. మనము పోవుదము రమ్ము.

రాజ్య—లీలావతి యెవరు?

పూర్ణ—కులమునకుమాత్రము వేశ్య. స్వామిశిష్యురాలు. వ్యభిచార మును మాన్పించి వేశ్యలనెల్ల జేర్చి నాటకసమాజ మొకటి స్థాపించి దానివలన వచ్చిన లాభమును ప్రజాహితకార్యముల కుపయోగించుచుండును.

రాజ్య—మహాత్ముడు పతితపావనుడుగదా!

పూర్ణ—ముఖ్యముగ నామె పురుషపాత్ర మభినయించుచుండగ చూడవలెను! ఎట్టిపురుషులు నందరు.

రాజ్య—ఆలాగా? ఆలస్యమెందులకు, స్వామిసందర్శనము చేయుదమురండు.

గీ. భూరినిబిడాంధకారప్రపూర్ణ మయిన
నాదు జీవితపథమున నవ్యకాంతి
కిరణ మొక్కండు దొరకిన కరణియయ్యె
హాదృయమా! కొంత శాంతింపు మింక నైన.

(నిష్క్రమింతురు.)

---

# రా జ్య ల క్ష్మి



## నాలుగవ అంకము



### మొ ద టి రం గ ము

సమయము—రాత్రి ఎనిమిదిగంటలు

ప్రదేశము—బొంబయిలోని టాజ్‌హోటలు

[ప్రవేశము—శ్యామసుందర్, స్నేహలత]

శ్యామ—నారీమణీ! మూడు నెలలనుండి మీసహవాససౌఖ్య మనుభవించుచున్నను, ఇంకను మీప్రయాణపుబడలిక తీరియుండదేమో యని ఇంతవరకును ఈవిషయమునుగూర్చి ప్రసంగింపనైతిని. రెండేండ్లక్రితమే నామనస్సులో మిమ్ము వరించితిని. మొట్టమొదట మీదర్శనభాగ్యము నాకు 'ట్రూలవ్' (true love) అను నమెరికనుఫిల్ములో లభించినది. అప్పటి నాయనుభవము నేమని వర్ణింతును!

సీ. నవ్వినవవ్వులో నవరత్నములు రాల
　　　　ముదిపించి మెలగిన ముద్దుమోము,
కడకంటిచూపులో పుడమిస్వర్గము జేయు
　　　　కాంతి వర్షించెడి కన్నుదోయి,
ముత్యాలహారముల్ మూటగట్టినయట్లు
　　　　నీటు గుల్కుచునుండు మాటపొందు,
రాగమాధుర్యంబు తీగెలుసాగంగ
　　　　పన్నీరు జిలికించు పాటతీరు,

గీ. నన్ను నీదాసునిగ జేసె నన్ను తాంగి
వేయిమాటలఫలమేమి వేడ్కతోడ
ప్రేమసామ్రాజ్యభరమును స్వీకరించి
సఫలమొనరింపు నాజన్మ చారుశీల.

స్నేహ—ఆర్యా! ఐ. సి. యస్. ప్యాసయి, జిల్లాజడ్జీపదవి నధిష్ఠించుచు సినీమానటిని వివాహమాడగోరుట చిత్రముగ నున్నదే! బహుశః తమకు నాపూర్వచరిత్రము తెలిసియుండదేమో!

శ్యామ—కాదు. మీకు నామనస్తత్త్వము తెలిసియుండదు. సినీమానటియైనంతమాత్రమున వివాహార్హతను గోలుపోవలసినదేనా? నాదృష్టిలో మీ నాట్యసామర్థ్యము శుభలక్షణము గాని అవలక్షణము కాదు. ఇక మీపూర్వచరిత్రమును గూర్చి నేను పూర్ణముగ నెరుగుదును. పొరపాటున మాణిక్య మొకసారి బురదలో జారినంతమాత్రమున మాణిక్యముగాకపోవునా? పశ్చాత్తాప ముదయించిన వెనుక నిక పారిశుద్ధ్యమునకు లోటేమి?

స్నేహ—ఇంత దయార్ద్రచిత్తతగలుగు మిమ్ము జిల్లాజడ్జీగ నియమించి అధికారులు తమయౌచిత్యజ్ఞానమునకు వన్నె పెట్టుకొనిరి.

శ్యామ—వివాహము శీలమునకు కవచముగదా! వయస్సువచ్చిన నటీమణులెల్ల వివాహమాడితీరవలె నని యొకచట్టము ప్యాసు చేయించినచో నెట్లుండునో?

స్నేహ—అసలు స్త్రీలు నాట్యరంగము నధిష్ఠింపనే రాదని యొక చట్టము ప్యాసుచేయించినచో నంతకంటె బాగుండునేమో!

శ్యామ—ఎంతమాట చెప్పితిరి? మిమ్ము ఫిల్ములో చూచినవెనుక అట్టి చట్టమును గూర్చి కలలోనైన నాలోచింపరాదు.

స్నేహ—ఆలాగయినచో నాట్యకళకు వివాహమునకు చుక్కయెదురు గదా. మీరుచెప్పిన మొదటిచట్ట మసలే పనికిరాదు. వివాహము

వెనువెంటనే సంతానము —సంతానము నాశ్రయించుకొని చిత్త విక్షేపము సిద్ధించునుగదా!

శ్యామ—కల్పవృక్షములవలె సంతాననిరోధసాధనము లుండగ నా భయ మక్కరలేదే?

స్నేహ—సంతాన నిరోధసాధనము లనిపేరేగాని వాస్తవమున ప్రయోజనకారులు కాకపోవచ్చు నని కొందరు శాస్త్రజ్ఞుల యభిప్రాయము. ఎట్టి స్వేచ్ఛావర్తన మొనర్చినను పురుషుని కిబ్బంది లేదు కాని స్త్రీకి కష్టముకదా?

శ్యామ—(చిరునవ్వుతో.) స్త్రీల యభివృద్ధి కాటంకము కలిగించు చున్నా రని పురుషులను నిందించెదరు గాని అనివార్యము లగు నాటంకముల నెన్నిటినో భగవంతుడే నిర్మించినాడు. పోనిండు సంతానవతులగు స్త్రీలలోమాత్రము నాట్యకళోపాసకులులేరా?

స్నేహ—ఉభయభ్రష్టత్వమున కంతకంటె నుత్తమసాధనము లేదు. సంతానముమీది దృష్టిచే నాట్యకళ— నాట్యకళమీది దృష్టిచే సంతానము— చివరకు రెండును శోషించును. ఏకాగ్రతతో బ్రహ్మచర్య మవలంబించుచు నాట్యోపాసనమున తారాపథము నంటినను మంచిదే. లేదా గృహస్థజీవితమును స్వీకరించి పిల్లలతో— పాపలతో— భూలోకస్వర్గ మనుభవించినను మంచిదే. అంతేగాని రెండిటికినిగాని త్రిశంకుస్వర్గ మెందులకు?

శ్యామ—"బ్రహ్మచర్యము బ్రహ్మచర్య" మను చున్నారు. మహర్షులకు దిక్కులేదు. నటీనటకుల కది యప్రయత్నముగ సిద్ధించునా?

స్నేహ—మీరు పొరబడు చున్నారు. నాట్యవిద్యోపాసన మొనర్చు నటీమణు లెంతో నియమముతో వర్తించిననేగాని నిముసములో శరీరములోని నవకము నశించును. నవకము నశించినవెనుక గ్రుడ్డి గవ్వకు బనికిరారు. పశ్చిమమున, ఎక్కడనో ఒకరిద్దరుతప్ప, నటీమణు లెంతోనియమముతో వర్తింతురు.

శ్యామ—సంతోషమే. ప్రస్తుతాంశమునకు వత్తము. మీరు నా మాట కేమిచెప్పెదరు ?

స్నేహ—నాట్యకళమీది వ్యామోహము నశించి యిప్పటికి సంవత్సరము పైగ నయినది. అందుచే నాయిబ్బందిలేదు. కాని

చ॥ పరమపతివ్రతామణి కపాయ మొనర్చిన పాపశాంతికై
తిరుగుచునున్నదాన నిటు దీసతబూని విదేశవాసినై.
గురుచరణారవిందముల గొల్చుటతక్క సమస్తభోగముల్
మరచి చరించుచుంటి కొరమాలిన జీవిత మేవగించుచున్.

శ్యామ—మీగురువుగారు రచించిన గ్రంథములను కొన్నిటిని నేను కూడ పఠించితిని. మీజీవితమును మీ రేవగించుకొనుచున్నట్లు చెప్పుచున్నారు. ఆత్మతిరస్కృతికి మీగురువుగా రంగీకరింప రే ?

సీ. సిగచుట్టు ముడిచిన చేమంతిపూదండ
యర్ధచంద్రాకృతి నలరు చుండ
మొగలి రేకులబోలు ముద్దుచెక్కిళులతో
* విష్ణుచక్రంబులు వియ్య మంద
నాసికాగ్రముపైని భాసిల్లు 'బేసరి'
దంతకాంతులతోడ పంతమాడ
శృంగార మొలికించు బంగారు హస్తముల్
గాజులకాంతితో కలసియాడ

గీ. ఈమనోహరమూర్తి నా యింటనిలిచి
కాంతిపుంజంబు వర్షించు గడియకొరకు
ఎదురుచూచుచు నున్న నాహృదయమునకు
శాంతి గృపసేయరాదె విశాలహృదయ !

* స్త్రీలు ధరించు నొక విధమయిన కర్ణాభరణము. చక్రాకృతిగ నుండును.

స్నేహ—మహాశయా! మీవంటి సుకుమారహృదయులతో కఠిన ముగ మాటాడవలసి వచ్చుచున్నది. మీ యనురాగమును మహా భాగ్యముగ స్వీకరింపవలసిన నేను గుర్వాజ్ఞ ననుసరించి వెనుదీయ వలసి వచ్చుచున్నది. రాజ్యలక్ష్మీదేవియెడ నొనర్చిన ద్రోహ మునకు ప్రాయశ్చిత్తముగ సతీపతుల నేకము చేయువరకు నేను వివాహ మాడరాదని మాగురువుగారు నిర్ణయించినారు.

ఉ. చేసిన పాపకార్యములు చిచ్చువలెన్ జెలరేగుచుండగా
వేసినవేసముల్ ప్రబలవేదన బెంచి యలంచుచుండగా
గాసిలిక్రుగ్గు నాహృదయకాసనమున్ వరియింతురేని ఆ
యాసమెకాని సౌఖ్యలవమైన లభించునె పూరుషోత్తమా.

శ్యామ—అసాధ్యమగు పరిస్థితి తెచ్చిపెట్టిరే! ఇప్పుడు జగన్మోహన రావుగారు మీస్వాధీనములో లేరుగదా! మీ రేమి చేయగలరు?

స్నేహ—అదే నేనును ఆలోచించుచున్నాను. ప్రస్తుతము మాగురువు గారి గురువుగారగు బ్రహ్మానందస్వాములను సందర్శింపవలెనని విద్యాపురమునకు నేను ప్రయాణము పెట్టుకొన్నాను. ఇప్పుడు రాజ్యలక్ష్మీదేవి వారి శిష్యురాలట. ఆమె పాదముల పైబడి క్షమాపణ వేడుకొన్నచో కొంతవరకు హృదయతాపము శాంతిం చునుగదా?

శ్యామ—మీ కీ యకాలవైరాగ్య మేమో నాకర్థము కాకుండ నున్నది. ఈసన్యాసుల మాటలు విని చివరకు సన్యసింపరుగద!

స్నేహ—మహాశయా! మీరుకూడ ఇట్లు మాటాడుట ఆశ్చర్యకర ముగ నున్నదే? సన్యాసుల మాటలు వినినంతమాత్రమున సన్యాస యోగము సిద్ధించినచో నిక గావలసిన దేమున్నది? దానికి పూర్వ జన్మసంస్కార మెంతయుండవలెను? నావంటి చపలస్వభావలకు

నియమబద్ధమగు గృహస్థజీవిత మెన్నిజన్మములు నడపవలసి యున్నదో. మీ కావిషయమున సంశయ మక్కరలేదు.

శ్యామ—మీ యిష్టమెట్లో అట్లే కానిండు. కాని ఒకటిమాత్ర మిది వరకే నిశ్చయించితిని.

చ. లలితమనోహరాకృతి కలంకరణం బగు నాట్యవిద్యచే
జలజల పూలు రాలిచి వసంత మొనర్చి మదీయజన్మకున్
గలకల నవ్వు నీముఖవికాసము గ్రోలగ నబ్బదేని నే
నిలిచెద బ్రహ్మచర్యమున నీరజలోచన! విశ్వసింపుమీ.

స్నేహ—నాపయి నింత యవ్యాజానురాగము చూపుచున్న మీఋణ మెట్లు తీర్చుకొనగలనో తెలియకుండనున్నది.

శ్యామ—ఎన్ని ఋణములయినను ఒక్కమందహాసములో మీరు గురియు మాణిక్యముల వెలలో సగమునకు సరిరావు. సెలవు. నేను ఎల్లుండి చెంగల్పట్టులో చార్జిపుచ్చుకొనవలెను. ట్రాంసుఫరు చేయుదు రని వదంతిగ నున్నది. ఎక్కడకు చేయుదురో తెలియదు—

(నిష్క్రమించును.)

స్నేహ—ఈ యనురాగము చూడగ నాలో నాకే సిగ్గువేయుచున్నది. ఇట్టి పవిత్రవర్తనుని సమీపమున నిలువబడుటకైన నా కధికార మున్నదా?—

చ. కలుషితమయ్యె జీవితము. కామవికార మడంపలేక వి
చ్చలవిడి సంచరించితిని. జన్మము నించుక భారతావనీ
తలమున బుట్టు నుత్తముల దాస్యమొనర్చెదు పూతవృత్తిలో
మెలగగనిమ్ము సజ్జనసమీపవికస్వర కాంతిభాస్వరా!

(తెరపడును.)

---

## రెండవరంగము



ప్రదేశము:—శంకరరావుగారి యిల్లు

ప్రవేశము—శంకరరావు శేషగిరిరావు

శేష— చచ్చిన పామును మీరు మరల చంపఁ బ్రయత్నించుచున్నారు.

శంక—అనఁగ నా కర్థము కాలేదు.

శేష—సౌత్ సీబ్యాంకు దివాలా తీసిన సంగతి విన్నారా?

శంక—ఆహా!

శేష—జగన్మోహనరావు నాటకము లాడి సంపాదించిన ధన మంతయు నందులో నున్నదట!

శంక—ఇంకేమున్నది! పాదుషా ఫకీ రయినాడు!

శేష—అంతేకాదు, పాపము! దెబ్బమీదదెబ్బ! స్నేహాలత నాతడు పరిత్యజించినట్లే మార్గరెటు అను నాంగ్లసినీమానటి యాతనిని పరిత్యజించి సుందరశింగు అను కాశ్మీరనటునితో నుడాయించినది—

శంక—శాస్తి బాగుగ జరిగినది! పాపము స్నేహలత ఈతని నిమిత్తము రెండులక్షలరూపాయలు వ్యయపరచినది. ఈరోజున నీతడు ప్రపంచమునందెల్ల విఖ్యాతుడైనాడన్నచో నా చలువయంతయు స్నేహాలతదే కదా!

శేష—ఈ పరిస్థితులలో నీనోట్లకే సాతనిపయి బనాయించుట యనావశ్యకము కాదా?

శంక—అట్లనకుము. ఆస్తి పోయినది గాని పలుకుబడి యెక్కడకు పోయినది?

శేష—అంత విశ్వవిఖ్యాతుడయినవాడు ఏజిల్లాజడ్జీపదవికొరకో ప్రయత్నించును గాని ఇంకను పబ్లికుప్రోసిక్యూటరీ పదవికై మీతో ప్రతిస్పర్ధించునందురా?

శంక—ఏమో యెవరు చెప్పగలరు? మనము ప్రమత్తులమయి యుండ రాదు? అదిగాక రాజ్యలక్ష్మికి చాలాపొగరుగనున్నది. ఆమె మీది కసిదీర్చుకొనుటకు గూడ ఆతనిని హింసింపవలయును. ఆమె పొగ రడంపవలయును.

శేష—ఆమెపొగ రామెభర్తయే యడచినాడు. పాపము! మహాపతి వ్రత. ఆమెనుకూడ ఇందులో జేర్చినారేమయ్యా!

శంక—బయటపడనంతవర కందరు పతివ్రతలే. దాని కేమి గాని—ఆమెమీద కేసు నిలువ దని నాయభిప్రాయము.

శేష—మీమతములో పాతివ్రత్యమను పదార్థమునకు చోటే లేదేమోలెండు. ఆమె మీద కేసు నిలచినను నిలువకపోయినను జగన్మోహనరావును తప్పించుట బ్రహ్మతరముగాదు. అపరచాణక్యులు మీరు పన్నిన వ్యూహమునుండి తప్పించుకొనుట కెవని తరము? ఈసంతకములు నీపోస్టుముద్రలు ఎట్లు సంపాదింపగలిగితిరయ్యా. కౌశికగోత్ర మయినందులకు మీరు నిజముగ విశ్వామిత్రు నంతటివారు. సృష్టికి ప్రతిసృష్టి చేయగలరు?

శంక—ఏదీ మనయుద్యమము కొనసాగవలెను గదా?

శేష—ఇంకను సందేహ మున్నదా? నాదీ పూచీ.

శంక—యమదూతలవలె వారంటు లప్పుడే బయలుదేరినవి. నలుగురిలోను అవమానకరముగ నుండుటకయి జగన్మోహనరావును నాటకపుపెండాలులోనే అరెస్టుచేయవలసినదిగ ఏర్పాటు చేసినాను. నీకిందులో గవర్నమెంటుకు వ్రాసి జూనియరుబ్రీఫు నిప్పించెదను.

శేష—చాలకృతజ్ఞుడను. నమస్కారములు. సెలవు.

(నిష్క్రమించును)

శంక—అష్టాక్షరీమంత్రజపఫల మిప్పుడు కనపడవలెను!

(నిష్క్రమించును)

---

## మూడవరంగము



సమయము—సాయంకాలము నాలుగు గంటలు
ప్రదేశము—మద్రాసులో జగన్మోహనరావుగారి బస
[ప్రవేశము—జగన్మోహనరావు ఆతని యాంతరంగిక
మిత్రుడు ప్రభాకర్]

జగ—కొండంత యుత్సాహముతో స్వదేశములో నడుగుపెట్టిన నాకు ఎంతలో నెంత యుత్సాహభంగమైనది!

చ. తిరిగితి దేశదేశముల ద్రిమ్మరినై. నవఖండభోగముల్
మరగితి. రాజరాజుల విమానములన్ విహరించి త్రుళ్లితిన్.
గిరగిర ద్రిప్పికొట్టి యిటు గేలియొనర్చు నదృష్టదేవతా
చరణపరాగసంగతిని సాగిలి మ్రొక్కెద భారతాంబికా!

ప్రభా—మీవంటి యార్జనశీలునకు అరువదివేలపౌను లనగ నెంత? ఈసారి మరల యూరప్ఖండమునకు పోయినచో అంతకు రెండు రెట్లు ధన మార్జింపగలరు.

జగ—(వినిపించుకొనకుండ) ఆహాహా! మార్గరెట్టు ఎంత యవమానము తెచ్చిపెట్టినది!

సీ. ఏపాప మెరుగని యిల్లాలి నేడ్పించి
పరదేశముల కేగు పాపఫలమొ,
జపపరాయణ యైన జననీమతల్లికి
పరితాప మొడగూర్చు పాపఫలమొ,
సర్వస్వ మర్పించి సాహాయ్య మొనరించు
స్నేహలతను పీడు ద్రోహఫలమొ,
మతధర్మములు మాపి మద్యపానాదిక
వ్యసనముల్ మరగిన పాలిఫలమొ,

గీ. చెప్పజాలను. గాని నా జీవితంబు
ఉన్నతనగాగ్రములనుండి యూడిపడుచు
దిక్కుమాలి — గుభిల్లని — దిశలు మ్రోగ
క్రుంగిపోయెను పాతాళకుహరమునకు.

ప్రభా—(తనలో) పాప మిదివరకీయన పరిత్యజించినవారే గాని ఈయనను పరిత్యజించినవారు లేదు. (ప్రకా) ఆర్యా తమయాజ్ఞ యయినచో కాశ్మీరముపోయి ఆనిర్భాగ్యురాలిని జుట్టుపట్టుకొని ఈడ్చుకొనివచ్చి మరల తమపాదముల కర్పింపలేనా ?

జగ—ఛీ. ఛీ. కుక్కముట్టుకొనిపోయిన పదార్థము నాకెందులకు ? నా కాతలంపు మందున కయినలేదు.

చ. వెనుకటిజీవితస్మరణ వేదనబెంచెను. సాధువృత్తముల్
గనుగొన దుర్లభంబులగు కాంచనసౌధము లట్లు ద్రోచె దు
ర్వినయము డించి మాతృపదపీఠము నే భజింపనేర్చినన్
మనుగడ నుద్ధరించుకొనుమార్గ మొకండు లభింపకుండునే?

ప్రభా—(తనలో) ఈయన కింటిమీదికి దృష్టిపోయినట్లున్నది. మంచిదే కదా ! [ప్రకా] ఇట్టిసంకల్ప ముదయించినవెంటనే యాచరణలోనికి దెచ్చుట మంచిదికాదా ? విద్యాపురము పోవుదమా ?

జగ—ఇదిగో ! నక్షత్రకునివలె మనల నీ నాటకకళాపరిషత్తొకటి వేపుకొని తినుచున్నది కదా ! నేటితో నిదియాఖరయినచో రేపు బయలుదేరవచ్చును.

ప్రభా—ఈనాటిరాత్రి సారంగధరనాటక మట. మనవిద్యాపురములోని “లలితకళానాటకసమాజము” వారు ప్రదర్శింతురట. మనగోడవలో మనమున్నాము. లేకపోయినచో విద్యాపురమునుండి యెవరెవరువచ్చిరో కనుగొని యుందును.

జగ—ఎవరు వచ్చినను ఎవరుమానినను ఇప్పుడు నాటకములపేరు చెప్పగనే నాకొడలు జలదరించుచున్నది. “వెనుకటిజీవితమునకు

స్వస్తి చెప్పి నూతనజన్మ మెత్తవలె * ననుతహాతహా నన్ను నిలువ నిచ్చుటలేదు—

ప్రభా—ఈ యొక్కరోజును మాటదక్కించుకొనకున్నచో బాగుండదు. కళాపరిషత్తువారు చిన్నబుచ్చుకొందురు.

జగ—కానిమ్ము. నీవుకూడ నాతో నుండవలెనుసుమా. నాకీ దినమున మతిపోయినది. మనస్సులో బహు గందరగోళముగ నున్నది—

ప్రభా—ఇదిగో. వెంటనే భోజనము ముగించుకొని వచ్చెదను. సెలవు.

(నిష్క్రమించును)

జగ—హా! రాజ్యలక్ష్మి!

గీ. వేయిమూర్తులతో మనోవీథి నిలచి
పిలచుచున్నది నన్ను నీప్రేమరథము.
ఎక్క జాలక వెనుకకు స్రుక్కిస్రుక్కి
మ్రొక్కుచున్నాడ తలవంచి ముద్దుగుమ్మ! (నిష్క్రమించును)

---

## నాలుగవరంగము

రంగము—మద్రాసులో నొకనాటకరంగము

టయిము—రాత్రి 8 గంటలు.

[స్టేజిమీద తెరపడియుండును. ప్రేక్షకులలో మున్ముందు స్థానము లలంకరించుచు జగన్మోహనరావు ఆతనిప్రక్కనే ప్రభాకరము. జగన్మోహనరావుమెడలో నధ్యక్షపదవికి సూచకముగ పూలమాల.]

జగ—ఎంత సాహసము! ఎంత సాహసము.

ప్రభా—రాజనరేంద్రుని వివాహమునుగూర్చి ముచ్చటించుచుంటిరా?

జగ—కాదు. కాదు. ఈనాటకములో చిత్రాంగిపాత్రమును ధరించి రాజ్యలక్ష్మి నాటకరంగ మధిష్ఠించినది. ఎంతసాహసము! ఎంత సాహసము!

ప్రభా——ఆమె రాజ్యలక్ష్మిదేవి యనియే స్థిరపరిచితిరా ?

జగ——ఇంకను సందేహమా ? నేను విదేశయాత్రమానవిచో తాను కూడ నాటరంగ మధిష్ఠించెదనని నన్ను బెదరించినది. తుద కనినంత పనియు చేసినది.

ప్రభా——ఆమె రాజ్యలక్ష్మిదేవి యనియే స్థిరపరచినను మీ రంతగ నాశ్చర్యపడవలసిన కారణము నాకుకనబడదే ? దీనిలో సాహస మే మున్నది ? ఇంతవరకు ఆమె చిత్రాంగిపాత్రము సద్భుతముగ నభినయించుచున్నది. " స్త్రీలే స్త్రీపాత్రములు ధరింపవలె " నను మీ సిద్ధాంతమునకు నేడు మరింత బలము చేకూరినదిగదా ?

జగ——స్త్రీలు—స్త్రీపాత్రములు—సిద్ధాంతములు—వీనిమాట నటుండనీ యవోయి ! రాజ్యలక్ష్మి నాట్యరంగ మెక్కుటేనా !

ప్రభా——మీసతీమణి యయినందుల కామె యీపని నిదివరకెన్నడో చేయవలసియున్నను స్త్రీలకు సహజమగు బిడియముచే సాహసింప జాలకపోయినది. నిజముగ నామె కున్నవైదుష్యమునకు సౌందర్య మునకు——

జగ——నీ " వైదుష్యము " చట్టుబండలుగాను ! ఉండవోయి. కుల సతులు నాట్యరంగ మెక్కినచో నికనేమయిన నున్నదా ? కొంపలు గుభిల్లున గూలవా ?

ప్రభా——మీ మాటలు నాకు వింతగ నున్నవే ! కులసతులు నాట్యరంగ మెక్కుచున్నట్లు ఈనాడే మీకు తెలియవచ్చినదా ? అమెరికా లోను ఇంగ్లండులోను ఎందరు కోటీశ్వరుల కులసతులతో ఎందరు రాజ్యాంగవేత్తల కులసతులతో మీ రభినయింపలేదు ?

జగ——పాశ్చాత్యసంఘపరిస్థితులు వేరు. మనసంఘపరిస్థితులు వేరు. పాశ్చాత్యసంఘములో నయినను గ్రేటాగార్బో " హాలీవుడ్డు " లో నడుగుపెట్టినందుల కామెమగడు గుండెపగిలి చావలేదా ?

ప్రభా—తనవరకు వచ్చువరకు ఎన్ని శ్రీరంగనీతులయినను చెప్పవచ్చును కాబోలును! ఎన్ని సిద్ధాంతములయినను చేయవచ్చును కాబోలును!

జగ—అధిక్షేపించుట కాదు. బాగుగ నాలోచించి చూడుము. ఇంతవరకు హిందూసంఘమున గృహస్థజీవిత మీమాత్రమయిన ధర్మానుగుణమునను సౌఖ్యప్రదముగను ఉన్నదనినచో అది స్త్రీలు పెట్టిన భిక్షయేగదా! పాశ్చాత్యసాంఘికజీవితముకంటె మనసాంఘికజీవిత మెన్నియోరెట్లు ప్రశస్తముగ నున్నట్లు నా కీవిదేశయాత్రవలన బోధపడినది. కాని కులస్త్రీలుకూడ స్వధర్మమునకు స్వస్తిచెప్పి నాట్యరంగమునకు పరుగులెత్త నారంభించినచో భావిగతినిగూర్చి నీళ్లు వదలుకొనవలసినదే.

ప్రభా—శకుంతలానాటకములో మీరు దుష్యంతపాత్రమును ధరించినపుడు శకుంతలా పాత్రమును ధరించి యభినయించిన "కాంచనమాల" సంయుక్తరాష్ట్రములకు ప్రధానమంత్రియగు "కలేల్కరు" గారి సతీమణిగాదా? ఈ యుపన్యాసమామె కిచ్చి ఆమెను నాటకరంగ మెక్కకుండ నెందులకు వారింపలేదు?

జగ—అప్పటికిని ఇప్పటికిని మనయభిప్రాయములు మారిపోలేదా? అప్పుడు 'నాట్యకళ' యనిన నాకెంత భక్తియో ఇప్పు డంత విరక్తి. ఇప్పుడు స్త్రీలమాట యటుండగ పురుషులే నాట్యరంగ మధిష్ఠింపరా దను వాదనలోనికి క్రమముగ దిగుచున్నాను. ఈనాటక సమాజములు బయలుదేరినవెనుక మనసంఘము వట్టి మాలకూ డయిపోయినది.

ప్రభా—ఇట్టి తీవ్రపరిణామము సహజముగాదు. మీ యభిప్రాయ పరిణామము మాట నటుండనిండు—మూడేండ్లయి యిల్లు కదలినారు. ఒక్క కార్డు ముక్క వ్రాసి ఆమె క్షేమము కనుగొనరయి

తిరి. ఒక్క పయిసయినను పంపి ఆమె క్షుద్బాధను తీర్చుకొను నవ కాశము గల్పింపరయితిరి. ఏనాటకరంగమును అధిష్ఠింపక ఆమె యేమి చేయు ననుకొంటిరి ?

జగ—జీవనోపాయమున కిది యొక్కటే మార్గమా ?

ప్రభా—మీసతీమణిగావున సర్వవిధముల మీ యడుగులజాడ ననుస రించినది.

జగ—ఎందుకయినను మంచిది. నే నింటికి పోయెదను.

ప్రభా—మీరు అసలే రాకపోయినను అంత యిబ్బందిలేదుకాని వచ్చి నాటకమధ్యమున ఇంటికిపోయినచో కళాపరిషత్తుకు అంతకంటె నవమానములేదు. ఈ తెర యెంతకు లేవకుండ నున్న దేమి ? మూతిముడుచుకొని పండుకొనియున్న భార్యవలె ఎంతసేపటికిని ఆంధ్రనాటకరంగములోని తెర లేవదు కాబోలును.

జగ—తెర యెత్తకుండ నే నింటికి పోవుట మంచిది. ఇక్కడ నున్నచో రసాభాసము కాకమానదు.

ప్రభా—(చిరునవ్వుతో) అంత ప్రమాదము లేదు. ఆమె మీసతీమణి కా దనియే నానమ్మకము. సాలగ్రామము సంపుటములో నుండును గాని సిగరెట్టుడబ్బాలోనికి రాదుగదా. ఒకవేళ మాటవరుసకు మిమ్ము వెనుక బెదరించినను ఆమె అంతపని చేయదు—చేయ లేదు. మనిషిని పోలిన మనుష్యు లుండరా ? అదిగో తెర లేచు చున్నది. మీరు నిదానించి చూడుడు.

జగ—సరే చూతముగదా !

అంతర్నాటకము ప్రారంభము

[ తెరయెత్తగ సారంగధరపాత్రము, చిత్రాంగి పాత్రము బ్రవేశింతును ]

సా॥పా॥—తల్లీ ! ఈమందిరమునగల విశేషములనెల్ల చూపితివిగదా. ఇక నాపావురమును నాకిచ్చి పొమ్మనరాదా ?

చి॥పా॥—(తనలో) ఎన్నివిధముల చూచినను ఈతడు నాకు స్వాధీన మగునట్లు లేదు. ఏమిగతి? నా వెఱ్ఱికాని యుక్తివాదములచే హృదయము కరగునా? ఇదివరకు త్రొక్కిన మార్గములుగాక ఒక క్రొత్తమార్గము త్రొక్కి చూచెదను. (ప్రకా) ఒకటికాదు రెండు పావురము లిచ్చెదను. నామేడపయి వ్రాలిన నీ పావురముతో పాటు నీస్వరూపసౌధాగ్రముపయి వ్రాలిన నాహృదయ మను పావుర మునుగూడ నీవు గైకొనిపోవచ్చును. రవంత తాళుము.

సా॥పా॥—అమ్మా! నీమాటలు నా కర్థమగుటలేదు.

చి॥పా॥—పాపము! పసికూనవు! ఒకచెంప గొట్టిన పాలు! ఒకచెంప గొట్టిన నీళ్లు గాబోలునేమి? (అని నర్మసూచకముగ నాతని చెంపపయి గొట్టబోవును.)

సా-పా॥—(అదిరిపడి దూరముగా తొలగి పోవును.)

జగ—(లేవబోవగ నాతనిని ప్రభాకరము వారించును.)

చి॥పా॥—అదేమి సారంగధరా! అంత బెదరిపోవుచున్నావు. ఈ పడకగది చూడుము. ఎంత సుందరముగ నున్నదో. నీకు చిత్ర లేఖనము వచ్చునా?

సా॥పా॥—రాదు.

చి॥పా॥—పోనిమ్ము. కవిత్వము వచ్చును గాబోలును. కవిత్వమునకు చిత్రలేఖనమునకు అక్కచెల్లెండ్రపొత్తుగదా. అవిగో! అవి నేను వ్రాసిన పటములు. వానిపై నీవు కవిత్వము చెప్పరాదా?

సా॥పా॥—అమ్మా! సావకాశముగ మరియొక్కసారి వచ్చెదను.

చి॥పా॥—ఇప్పు డవకాశము లేకపోవుట కేమివచ్చినది! ఇంటిదగ్గర నెవరైన ప్రియురాండ్రు విరహవేదన పడుచుందురా?

సా॥పా॥—(తలవంచుకొనును.)

చి॥పా॥—ఇదిగో! ఈ దంతపుబరణిలో నీవిగ్రహమును దాచుకొంటిని ఇది నేనువ్రాసినదే సరిగా నున్నదా? పలుకే బంగారమాయెనే? మాటాడవేమి?

సా॥ పా॥—చిత్రలేఖనాసామర్థ్యమును చూచి చకితుడ నైపోతిని.

చి॥ పా॥—(తనలో) పోనిమ్ము. ఇప్పటికయిన కొంత చలనము వచ్చినది గద! (ప్రకాశముగా) ఇదిగో ఈహృదయములో అంతకంటె మనోహరమయిన నీరూపమును శాశ్వతముగ బ్రతిష్ఠించుకొంటిని. (అని తనహృదయమువంక జూపును.)

జగ—ఆఁ. ఆఁ.

ప్రభా—నటులు నాటకమును జూడవచ్చినచో నిదే ప్రమాదము. రసానుభవమును పట్టజాలరు.

సా॥ పా॥—ఆఁ. ఆఁ. ఆమ్మో ఎంత ఘోరము! నీవు నా దురదృష్టవశమున చాల విపరీతముగ వర్తించుచున్నావు.

చి॥ పా—ఇందు ఘోరమేమున్నది? ఆ నిలువుటద్దములో జూడుము. మన మిరువురము ఎంత ఈడుజోడుగ నున్నామో. అప్పుడప్పుడు నా కొక యాలోచన పొడముచుండును. ఈ దిక్కుమాలిన రాజవంశములలో జన్మింపక నీవును నేనును అడవిలో చెంచుజాతిలో జన్మించియుండినచో అడవిగురువెందపూసలతో నలంకరించుకొని పిల్లనగ్రోవి చేతబూని నీవు హాయిగ బాడుచుండగ, నీ పాట నను గుణముగ నే నాడుచుండగ, వనమయూరములవలె పారావతమిథునములవలె సౌందర్యసామ్రాజ్యమునకు నీవు రాజువై నేను రాణినయి భూలోకస్వర్గము ననుభవింపకుండి యుందుమా?

సా॥ పా—కవివలె నీవు భావనాశక్తి నిష్టమువచ్చినట్లు పరుగెత్తించుచున్నావు. కాని—

చి॥పా॥—(నవ్వుచు) నటకుని భార్యకు నాట్య మబ్బినట్లు స్వల్పకాలములోనే నీసహవాసదోషముచే నాకు గవిత్వమబ్బినదేమో!

జగ—ఎంత పోటు పొడిచినదో!

ప్రభా—ఎవరో కవివ్రాసిన వాక్యములను వారు పలుకుచున్నారుగాని సొంతముగ మిమ్ముద్దేశించి మాటాడుచున్నా రనుకొంటిరా?

సా॥పా॥—అమ్మా! నీమాటలు మాతండ్రిగారి కత్యంత ద్రోహకరముగ నున్నవి. మా వంశగౌరవమును మంటగలుపుచున్నవి. వినలేక నాచెవులు చిల్లులు పడుచున్నవి.

చి॥పా॥—నీతండ్రిగారి చేష్టలు మన కత్యంతద్రోహములుగా లేవా? కుమారుని కని తెచ్చినకన్యను వివాహమాడుటలో వారు చూపిన చాపల్యముకంటె నీపటమును జూచినదిమొదలుకొని నేటివరకు ఒక్కరీతిగ ఏకాగ్రతతో నీసౌందర్యము నారాధించుచున్న నా స్థైర్యము ప్రశంసార్హముకాదా?

సా॥పా॥—అయ్యయ్యో! పూజ్యులయిన తండ్రిగారి నధిక్షేపించుట కూడనా?

ఉ. భారతవంశవర్ధనుని పాండురకీర్తి దిగంతవీథులన్
జేరి నటించె నాంధ్రకవిశేఖరుసూక్తుల. నంతవానికిన్
గూరిమిపత్నివై కులము గూల్పగ జూచెద వేల? మానసం
బారయగోరియైన తగునా యిటు వల్కగ పూజ్యమూర్తిరో!

చి॥పా॥—(తనలో) ఈతనితో వాదము పెట్టుకొన్నచో లాభములేదు. (ప్రకాశముగా) నవమన్మథాకార! నారీజనచిత్తచోర! నిన్ను పరీక్షించుచుంటి ననుకొంటివా? లేదు. లేదు. విరహానలములో నాహృదయము వేగిపోవుచున్నవి. ఈముహూర్తమువరకు ఎట్లో ప్రాణము నుగ్గబట్టుకొని యుంటిని. ఇక సాధ్యముగాదు. అదిగో

ఆపటమును చూడుము. మిహిరాంశువంశమునకు మేటికిరీటమైన పురూరవుడు సౌందర్యసామ్రాజ్యలక్ష్మియైన యూర్వసి నెట్లు ముద్దుగొనుచున్నాడో. ఏదీ ఒక్క ముద్దు.

జగ—నా చెవులలో సీసము కరగించి చిలుకరించిన ట్లున్నది. ఎంత సాహసము! ఎంత సాహసము!

ప్రభా—(తనలో) ఈతని నాపుటకు సాధ్యము గాకుండనున్నది. రసాభాస మగునేమో (ప్రకా) ఆవలికి పోవుదమా?

జగ—(విసుగుతో) ఉండవోయి. ఏదో భూకంపము వచ్చినట్లుగ నా కీలోకమంతయు తలక్రిందులయి పోవుచున్నది.

చి॥ పా॥—ఇందు సాహస మే మున్నది? ఈయదగినవాడవు గావున అడుగుచున్నాను. నా వలపునకు తగిన పారితోషికమును మాత్రమే నే నడుగుచున్నాను.

సీ. ఒయ్యారముల కెల్ల నున్న తావసన మాచు
నొప్పు నీనొసటిపై నొక్కముద్దు
సౌందర్యమున కెల్ల జననీమతల్లులై
యొప్పు కన్నుల కాంతి నొక్కముద్దు
మాధుర్యమున కెల్ల సోదరీమణియాచు
నొప్పు కెమ్మోవిపై నొక్కముద్దు
లాలిత్యమున కెల్ల పాలకస్థానమై
యొప్పు చెక్కిలిసీమ నొక్కముద్దు
గీ. సద్దుకొనగోరి తహతహ నందుచున్న
బీదరాలు త్వదీయమహా పాదయుగళి
నాశ్రయించెను విలయాగ్ని కాగలేక.
నిర్దయ వహింప కయ్యు సౌహార్దనిలయ!

సా॥ పా॥—(తనలో) ఇక నిక్కడ నున్నచో ప్రమాదము తప్పదు. ఎట్లో వదల్చుకొని యావల బడవలెను. (ప్రకాశముగా).

చ. ఎరుగక వచ్చినాడ క్షమియింపుము తల్లి! భవన్నివాసమున్
గురుపద మంచు నెంచితిని. ఘోరవిషానలతుల్యవాక్యముల్
గురియకుమమ్మ. నీ హృదయకోశమునుండి సుధాస్రవంతులన్
దొరగి పవిత్రహర్షమున దోగగనిమ్ము నమస్కరించెదన్.
ప్రస్తుతము నాకు సెలవిమ్మ. (అని పోబోవును.)

చి॥ పా॥—ఎక్కడికి పోయెదవు? 'నీవే నాసర్వస్వమును' అని నమ్మ కొనియున్న నన్ను వీడి ఎక్కడకు పోయెదవు? నా పాతివ్రత్య మంతయు నీయందే సబిడీకృతమయి యున్నది. నిష్కలంక మగు నా యనురాగమును—తనంత తానుగ నిన్ను వలచి వచ్చుచున్న నా యనురాగమును నిరాకరింపకుము.

ఉ. ఈ నగుమోము మోముపయి నిప్పుడె చేర్చి సుఖింపగావలెన్.
ఈ నవనీతవిగ్రహము నిప్పుడె నాకు విహారభూమిగా
గానుక యిచ్చి నా హృదయకావ్యమునందలి రాగమాధురీ
స్నానము స్వీకరింపవలె. జాలమొనర్పకు ప్రాణనాయకా!
(అని యాతనిని కౌగలింపబోవును.

సా॥ పా॥—(దూరముగ బోవుచు) ఛీ. ఛీ. స్వైరిణి వైనను...(జగన్మోహనరావు గుబాలున స్టేజి మీది కురుకును. ప్రభాకరము వారింపబోయినను లాభముండదు. సారంగధరపాత్రము జగన్మోహనరావు స్టేజిమీదికురుకగనే నిష్క్రమించును)

జగ—ఛీ. ఛీ స్వైరిణివైనను ఇంత యన్యాయముగ వర్తింపదే. రాజ్యలక్ష్మి? రాజ్యలక్ష్మి! ఏమిచేయు చుంటివి?

ఉ. పోయిన పోకతో 'మగడు పోయె' నటంచు తలంచినావొకో?
మాయురె! రంగభూమి వెలమానినివోలె నటించుచుంటివే?

'ఛీ' యనువారు లేరె? కులశీలము లెల్లను బుగ్గిచేసితే?
ప్రేయసి! యెంత కెంత విపరీత మొనర్చుచు నుంటి వక్కటా!

చి॥ పా॥—(చిరునవ్వుతో) అయ్యా! రంగభూమి కెక్కుటయే దోషమయినచో "నటచక్రవర్తు" లెల్ల నేమికావలసినది?

జగ—రంగభూమి కెక్కుటయే దోషమని నే ననుటలేదు. కాని కులసతు లిట్టిపాత్రములు ధరించి పరపురుషులతో ప్రణయ మభినయించుట తగదు.

చికి పా॥—"స్త్రీపాత్రములను స్త్రీలే ధరింపవలెనుగాని పురుషులు ధరింపరా" దని సిద్ధాంతీకరించువారు కూడ నిట్లు వాదించినచో నేమి చెప్పవలసినది?

జగ—ఎన్నడో బుద్ధిహీనుడవయి చేసిన సిద్ధాంతమున కిప్పు డధిక్షేపించుచుంటివా? బుద్ధి వచ్చినది. లెంపలు వైచుకొనుచున్నాను. చాలునా?

చి॥ పా॥—ఇప్పుడు లెంపలు వైచుకొన్నను వైచుకొనకున్నను నొక్కటియే. ఎంత చెప్పినను వినక విదేశయాత్రకుబోయి శతవృద్ధయగు జననిని హఠాన్మరణము పాలుచేసి—

జగ—ఆఁ ఆఁ మాతల్లిగారు మరణించిరా?

చి॥ పా॥—మరణించుటలోను దిక్కుమాలిన మరణము. ఇంటిలోని శవము నీవల బెట్టు వారయినను లేకపోయిరి.

జగ—హా తల్లీ!

చ. ఎరుగవు మాయమర్మముల నించుకయైన. జనించుటాదిగా
నురుతరకష్టజాలములె యుగ్గును పాలుగ గ్రోలినావు. నీ
చరమదశావశేషమున సన్నిధినైన వసింపలేక—హా!
పరియలు చేసితిన్ మనసు పావనమూర్తి! మహాతపస్వినీ!

ఓ పరమకిరాతుడా ! జగన్మోహనా, నీవు పుట్టియేమి ? పుట్టకేమి ? (రాజ్యలక్ష్మితో) పోనిమ్ము అపవిత్రచరిత్రుడ నయిననేను నాజననిదర్భశయ్య నంటకపోవుటయు మేలే. నీ వైన ఆమె కేలోటును రానీయకుండ నుపచరించితివా ?

చి॥ పా॥—అయ్యా, మీ స్వభావము కడువిచిత్రముగ నున్నదే. ఎనిమిదేండ్లు మీతో కాపురముచేసిన యిల్లాలినిగూర్చి ఇంత పూర్తిగ భ్రమింపదగినస్థితి కెట్లు వచ్చితిరో నాకు తెలియకుండ నున్నది. నేను రాజ్యలక్ష్మి ననియేనా మీ యభిప్రాయము ?

జగ—ఇది మరింత విచిత్రముగ నున్నదే ? ఇంతవరకు నీవు రాజ్యలక్ష్మి వైనట్లే మాటాడితివిగదా ? ఇంతలో మరల నీనాటక మెందులకు ?

చి॥ పా॥—మీ కుటుంబపరిస్థితు లన్నియును తెలియును గావున మీతో రవంత చర్చించినాను. అంతేగాని నేను రాజ్యలక్ష్మి నైన ట్లెచ్చటను అంగీకరింపలేదే ? నా పేరు లీలావతి. మేముకళావంతులము.

జగ—ఇది యంతర్నాటకములో నింకొక యంతర్నాటకమువలె నున్నది. ఏమియు విడిపోక గిజగిజ కొట్టుకొనుచున్నాను.

చి॥ పా॥—(తనలో) ఈనటనము నాకును కష్టముగనే యున్నది—

జగ—నేను నిన్ను నమ్మజాలకున్నాను.

చి॥ పా॥—నమ్మిన నమ్మవచ్చును. లేకున్నచో మానవచ్చును. కాని నాతో మీరు చనవుతీసికొనుట కంగీకరింపను (అని పోవుచుండును)

జగ—పోనిమ్ము. మీది విద్యాపుర మనుచున్నావు. మాకుటుంబపరిస్థితులు తెలియు ననుచున్నావు. రాజ్యలక్ష్మి క్షేమముగ నున్నదా ? ఒక్క మాట చెప్పి మరిపోవుము.

చి॥ పా॥—(నిష్క్రమించుచు) ఆఁ. పరమపదమున—

(అని నిష్క్రమించును.)

జగ—ఆ. ఆ. నాపాలిటి భాగ్యలక్ష్మియైన రాజ్యలక్ష్మియే గతిం
చినదా? ఎంత ఘోరము?

చ. శిరమున కర్హమైన తులసీదళదామము మూర్ఖవృత్తిచే
చరణయుగంబునన్ గలిపి శాశ్వతనిందను బొందినట్టి ని
ష్ఠురచరితుండ. నాబ్రదుకు శూన్యగృహం. బికకాల్పనేకదా!
హాహరి! నాయభాగ్యతకు హా ద్రోకయించుక గానుపించునే?
నా దురాశకాని నాకీ కష్టకాలమున భార్యాసంయోగమా?

ఓ నిర్భాగ్యుడా! జగన్మోహనా!

సీ. వేదమంత్రములతో పాదముల్ గడిగి నీ
కత్తవా రిచ్చిన యమృతమూర్తి;
జన్మజన్మకు నీదు సాహచర్యము గోరి
తపమొనర్చుచునుండు ధర్మమూర్తి;
దరహాసకాంతిచే తావకీనగృహంబు
స్వర్గతుల్య మొనర్చు శాంతమూర్తి;
నిర్మలప్రేమచే నీమనస్సీమను
రాజ్య మేలగజాలు పూజ్యమూర్తి;

గీ. సర్వధర్మస్వరూప నిగర్వశీల
పరమపావనమూర్తి నీభార్య సకట
చంపుకొంటివి చేజేత చంచలాత్మ
అనుభవింపుము తత్ఫల మహరహంబు.

[ప్రవేశము—ఇనస్పెక్టరు కోదండరావు, కొందరు పోలీసుభటులతో.]

కోదండ—అయ్యా! జగన్మోహనరావుగారు తమరేనా?

జగ—అవును.

కోదండ—తమరు జగత్ప్రసిద్ధులు. అయినను నావిధి నేను నిర్వహింప
వలయునుగదా. ఇదిగో తమపేర నీ అరెస్టువారంటున్నది.

మొదటిజనుడు—అన్యాయము! అక్రమము!

రెం॥జనుడు—ఆపదలోబడి యేడ్చుచున్న ఈయనకా అరెస్టువారం టేమి?

మూ॥జనుడు—పోలీసువారిని పచ్చడిచేయుదము.

జగ—మహాజనులారా! తప్పు. తప్పు. మీరు పోలీసువారి నేమియు అనవలదు. వారి ధర్మమును వారు నిర్వహించుకొనుచున్నారు. మన మందరమును రాజశాసనమును గౌరవింపవలసి యున్నది గదా—నాపయి ప్రేమగలవారెవ్వరును పోలీసువారిపయి తిరస్కార భావము చూపరాదని నామనవి. (పోలీసు ఇనస్పెక్టరుతో) అయ్యా! మీరు దేవదూతలు గాని పోలీసుభటులుగారు. జనులకు నా మొగమెట్లు చూపుదునా యని సంకోచించుచున్న నాకు మీరు కారాగృహమునకు దారిచూపి మహోపకారు లయినారు.

జనులు—రామ! రామ! ఎట్టి మహాపురుషున కెట్టియవస్థ వచ్చినదో.

జగ—మహాజనులారా! మీరు నాకయి యెందులకు విచారింతురు?

ఉ. అచ్చపు వేదమూర్తులకు నాకరమైన కులంబుకీర్తికిన్
మచ్చను దెచ్చినట్టి యధమాధమజన్ముడ. నాకునై వగన్
వెచ్చ మొనర్పగా దగదు. వీరవరేణ్యుల దేశభక్తులన్
స్వచ్ఛయశోవిశాలవిలసచ్ఛుభశీలుర జేరి కొల్వుడీ!

(నిష్క్రమింతురు)

---

# రాజ్యలక్ష్మి



## అయిదవ అంకము



### మొదటిరంగము

ప్రదేశము—విద్యాపురములో జెయిలులో నొకభాగము.

[ప్రవేశము—జగన్మోహనరావు]

జగ—

గీ. పూజ్యతమ మైన భారతభూమి యందు
అడుగు వెట్టిన దాది నా యాత్మవీణె
పాడుచున్నది దుఃఖాగ్నిపథములందు
పరమనిర్వేదపూర్ణ మా కరుణగీతి.

[తెరలో బ్రహ్మానందస్వామి ఈక్రిందికృతి పాడును]

త్యాగరాయకృతి

ఎటుల బ్రోతువో తెలియ ఏకాంతరామయ్య
కటకట నాచరితము కర్ణకఠోరమయ్య ॥ఎటుల॥
వట్టిగొడ్డురీతి భక్షించి తిరిగితి
పుట్టులోభుల జేరి పొట్టకై పొగడితి
దుష్టులతో గూడి దుష్కృత్యములు సల్పి
రట్టుజేసిన త్యాగరాజును దయతో ॥ఎటుల॥

జగ—సైబీరియాపట్టులలో జాహ్నవీప్రవాహమా? ఈ జెయిలులో నింతటి మంగళసంగీత మెక్కడనుండి వచ్చుచున్నదో. అదిగో ఎవరోసన్యాసి యిటు వచ్చుచున్నాడు.

ఉ. కాంతులజిమ్ము దేహమున కావుల దాల్చి, దయారసాన్విత
స్వాంతత దెల్పు చూపులు ప్రశాంతిపథంబున ప్రముగ్గు లీనగా,
తంతుల నారదాకృతి సుధారసధారల గ్రుమ్మరించు నీ
వింతతపస్వి నాహృదయవేదిక జొచ్చెను పావకాకృతిన్.

బ్రహ్మ—(ప్రవేశించును)

జగ—స్వామీ ? నమస్కారము. సంసారబద్ధునకు సర్వేశ్వరకటాక్షముపలె కారాగృహబద్ధుడనగునాకు తమదర్శనము లభించినది. తమ పేరు ?

బ్రహ్మ—బికారికి పేరేమి, ఊరేమి ?

జగ—తమరీప్రాంతముల సంచరించుట వింతగ నున్నదే ?

బ్రహ్మ—రోగులవెంబడి వైద్యుడును శిష్యులవెంబడి సన్యాసియు సంచరించుటలో నాశ్చర్యమే మున్నది ? ఈజెయిలు అధికారుల యనుజ్ఞ గైకొని ఖయిదీలకు నీతిబోధ గావించుటకయి తరచు నే నిందే సంచరించుచుందును.

జగ—ఈదినములలో నైశ్వర్యవంతులగు శిష్యులవెంబడి సన్యాసి సంచరించుట కొంతవరకు సహజమే. కాని సంఘములో నెవ్వరికిని అక్కరకురాని పాపాత్ములు వసించు జెయిలులో—

బ్రహ్మ—(చెవులుమూసికొని) అనరాదు. వినరాదు. జీవులందరును ఈశ్వరాంశాసంభూతులుగదా ! వారిని పాపాత్ము లనుటకంటె ఘోరమయిన పాపము లేదు. నేరముచేసినవానికి నీతిబోధగావించి న్యాయపథమునకు ద్రిప్పుటకు మారుగ వారిని జెయిళ్లలోద్రోసి గోరంత నేరమునకు కొండంత శిక్ష విధించి వారిని నానాటికి మరింత యధమస్థితికి సంఘమే తెచ్చుచున్నది. కానిండు. సంఘములో నెవ్వరికిని అక్కరకురానివారే నాకు గావలసినవారు. వారే నా బంధుకోటి.

జగ—పరమసంతోషము. అట్టివారిలో నగ్రేసరపదవి నాది. నన్ను తమరు స్వీకరింతురా ?

బ్రహ్మ—నిరభ్యంతరముగ. అంతకంటెనా ? మీ స్వరూపము చూడగ చక్రవర్తిలక్షణములు గానవచ్చుచున్న వే.

జగ—మీరు కేవలము పొరపడితి రని చెప్పుటకు వీలులేదు. నట చక్రవర్తి యనుబిరుద మొకటి యిప్పటికిని నాకున్నది.

బ్రహ్మ—ఇక నేమి ? ఈరోజులలో నటచక్రవర్తులదే రాజ్యము. నిజముగ రాజవంశమున జన్మించిన వారిని ఏదో వంక గల్పించుకొని పదచ్యుతుల నొనర్చుచున్నారు. నటచక్రవర్తులను పువ్వులరథములలో నూరేగించు చున్నారు. ఇప్పుడు పత్రికలనిండ సినీమానటుల విగ్రహములే.

జగ—తమరు పత్రికలు చదువుచుందురా ?

బ్రహ్మ—మీవంటివారి పరిచయము నిర్వహించుకొనుట నామాత్ర మైన నుండవలదా ? అయితే మీకీ కారాగృహవాస మెందులకు సిద్ధించినట్లు ?

జగ—(నుదుటిగీత యని సంజ్ఞ చేయును.)

బ్రహ్మ—మీ రేనేరమును చేయలేదా ?

జగ—చేసితిని. ఘోరమగు నేరముల చేసితిని. కాని ఆనేరములకు నాయీకారాగృహవాసమునకు ఎంతమాత్రము సంబంధము కానరాదు. ప్రస్తుతము నామీద నేను కలలోనైన ఎరుగని నేర మొకటి మోపినారు. దొంగతనముగ కరెన్సీనోట్లను తయారుచేయించి మార్పించుచున్నా నని పోలీసువారి కేసయినట్లు వినుచున్నాను. ఇంకను క్రిందికోర్టులోనయిన విచారణ ప్రారంభము కాలేదు.

బ్రహ్మ—మిమ్ము చూడగనే నా కేదో చెప్పనలవిగాని స్నేహ ముదయించుచున్నది. నిరపరాధులగు మీ కీజెయిలు నివాసము వచ్చినందులకు నా కెంతో చింతగ నున్నది.

జగ—దానికి చింతింపవలసిన పనిలేదు. ఎవనికర్మ వానినే కట్టికుడుపును. సర్కారు మోపిన నేరము చేయకపోయిన సరియా ?

సీ. బ్రాహ్మణోత్తముడనై ప్రభవించి మద్యంబు
తల్లిపాలను బోలె త్రావినాను.
పరసతీజనసహోదరభావమును వీడి
విసువక పశువునై మసలినాను.
మమతతో బెంచిన మాతృదేవత వీడి
పరదేశవాసినై తిరిగినాను.
విజ్ఞానరాశియౌ ప్రేయసి డెందంబు
చేజేత వ్రక్కలు చేసినాను.
గీ. బంధుగణ మెల్ల పోయె—నీ పాడుకట్టె
బ్రతుకు చున్నది. భూమికి భారముగను
అంధకారావృతంబు నా యాత్మచరిత
మేమి వివరించు కొందును స్వామి తమకు ?

బ్రహ్మ—ఆత్మాభ్యుదయమునకు పశ్చాత్తాపమే మొదటిమెట్టు. అసలు మీ దేయూరు ?

జగ— ఈయూరే. వెనుక నే నిచ్చట ప్లీడరీ వెలిగించినాను.

బ్రహ్మ—మీ భార్యనుగూర్చి ఏదో చెప్పినారే.

జగ—అవును. నేను విదేశములకు పోగా నావిరహమును భరింపలేక ఆమె మృతిజెందినట్లు తెలిసినది.

బ్రహ్మ—విరహమును భరింపలేక మృతిజెందు నాయికలు ప్రబంధములలోనే గాని లేరనుకొనుచుంటిని. మీ భార్య మరణించినట్లు మీ కెవరుచెప్పిరి ?

జగ—నా భార్యయే చెప్పినది.

బ్రహ్మ——మీ మాటలు నా కర్థము కాకుండ నున్నవి. మీరు జాగ్ర దవస్థలోనే మాటాడుచున్నారా? మీ భార్య మరణించినట్లు మీ భార్యయే యెట్లు చెప్పగలదు? మీ కిరువురు భార్యలున్నారా?

జగ——ఈనడుమ నీయూరినుండి యొకనటీమణి మద్రాసు వచ్చి నాటక మాడుచుండగ జూచితిని. ఆమె మూడుమూర్తుల నాభార్యవలె నుండెను. ఆమె నాభార్య మరణించినట్లు చెప్పినది. ఆమెయే నాభార్యయేమో యను సందేహము నాకిప్పటికిని వదలకుండ నున్నది. కాని నిశ్చయము తెలసికొనుట కవకాశము లేకుండ నీకారాగృహవాసము తటస్థించినది——నామనస్సు గానుగలోబడిన చెరకుకర్రవలె యమయాతన నందుచున్నది.

బ్రహ్మ——అంతయమయాతన మెందులకు? విశాల మైన విశ్వమునం తను చుట్టివచ్చితిరిగదా. జగత్ప్రఖ్యాతులు——మీకు మీభార్యతో సరితూగు సౌందర్యవతులే లభింపకుందురా? మగవాని కేమి లోటు——ప్రాతచెప్పు పోయినచో క్రొత్తచెప్పు వచ్చును.

జగ——స్వామి నాహృదయమును పరీక్షించుచున్నారేమో? కానిండు. విశాలమగు నీవిశ్వమున నేగాదు ఈమూడులోకములు వెదకినను నాభార్యతో నుపమింపదగిన స్త్రీ కానరాదు.

బ్రహ్మ——అంత సౌందర్యవతియా?

జగ——చర్మగతసౌందర్యమునం దామెను సరిపోలు వా రుండవచ్చును గాని ఆత్మసౌందర్యమునం దామెకు తుల్యులు కానరారు.

బ్రహ్మ——ఎందుచేతనో ఆమె మరణించినట్లు నాకు పొడకట్టదు.

జగ——ఇప్పటి నాగ్రహచారమును పురస్కరించుకొని చూచినచో ఆమె మరణించినట్లే నిశ్చయించుచున్నాను. నే నీరోజులలో బంగారమును ముట్టినచో మట్టి యైపోవుచున్నది. అట్టిచో నాభార్య జీవించియుండుననుట యసంగతము.

బ్రహ్మ—ప్రేమైకజీవులకు భార్యావియోగము దుస్సహమే.

జగ—ఓ ప్రేయసీ!

చ. విలవిలలాడు నా హృదయవేదన నింత గ్రహింపవేమి ? య
  ర్మిలి నొకమారు నాపయి నిరీక్షణమాలల జిమ్మవేమి ? నా
  వలపులరాణివై భువనవంద్యచరిత్రము నిర్వహించు నిన్
  గోలిచెడు భాగ్య మబ్బ దిక కోటియుగంబులకైన నెచ్చెలీ!

బ్రహ్మ—మీ బాధ చూడగ నాకు జాలివైచుచున్నది. మీ భార్య మీకు లభించుట కొక యుపాయము చెప్పెద నాలకింతురా ?

జగ—తమయొద్ద మృతసంజీవని యున్నదా ?

బ్రహ్మ—ఉన్నదో లేదో. అదియంతయు మీ కెందులకు ? మా యుపదేశములు గోసాయి చిటికెలు. తీర చెప్పిన తరువాత హేళనము చేయరాదు.

జగ—స్వామీ, నేను కొంతవరకు చపలస్వభావుడనే కాని మహాత్ములను హేళనము చేయునంతటి లఘుచిత్తుడను ఇంకను గాలేదు.

బ్రహ్మ—నే నొకమంత్రము నుపదేశింతును. అది యక్షరలక్షలు జపించినచో మీ భార్య స్వర్గమునుండియైన దిగి రావలసినదే!

జగ—జెయిలులో మంత్రోపదేశమున కెట్లు వీలుపడును ?

బ్రహ్మ—మా మంత్రములలో నున్న చమత్కారమే యది. వీనికి వెట్టిఛాందసము లక్కరలేదు. మీ భార్య పే రేమి ?

జగ—రాజ్యలక్ష్మి.

బ్రహ్మ—మా మంత్రముకూడ నదియే. ఆనామము నే మీరు జపింపవలెను.

జగ—నన్ను తమరు పరిహసించుట లేదుగదా ?

బ్రహ్మ—ఆపదలలో నున్న మీతో నాకు పరిహాసమా ?

జగ—ఇంతమంది యోగులను చూచినాను గాని ఎవ్వరును ఇట్టి మనో హరమార్గము నుపదేశించినవారు లేదు. బ్రతికియున్నన్నినాళ్లు భార్యను హింసించిన నిర్భాగ్యున కామె మరణించినవెనుక నామ స్మరణము తప్ప గతియుండునా ?

బ్రహ్మ—పరిపూర్ణ విశ్వాసముతో మామంత్రమును జపించినచో రెండుమూడు రోజులలోనే ఫలసిద్ధి యగును. సెలవు.

(నిష్క్రమించును.)

జగ—దాసానుదాసుడను. సెలవు. రాజ్యలక్ష్మీ!

ఉ. చీకటిరాత్రిగర్భమున శీతమయూఖుని రేఖ వోలె నీ
శోకపరీతచిత్తమున శోభిలుచున్నది నామమంత్ర. మే
దీ ? కనుగొందు నొక్కపరి. దివ్యవిమానము డిగ్గి వచ్చి నన్
జేకొనిపొమ్ము. నీ చరణసేవకు దీక్ష వహింతు ప్రేయసీ !

(తెరపడును.)

---

## రెండవరంగము

---

ప్రదేశము—విద్యాపురములో జెయిలులో నింకొక భాగము

[ప్రవేశము—జెయిలులో రాజ్యలక్ష్మి, బయటనుండి శంకరరావు]

శంక—ఓహోహో! ఏమిది! ఈ జెయిలు దేదీప్యమానముగ వెలిగి పోవుచున్నదే. ఎవరువారు ? రాజ్యలక్ష్మీదేవియా ? ముప్పది మూడుకోట్ల దేవతలు అంగరక్షకులుగ నున్న మహాపతివ్రతకు జెయిలుప్రవేశమేమి ? సాధ్వీమణీ! కుశలమా ?

రాజ్య—(పలుకక యూరకుండును.)

శంక—మాతో మాటాడినచో మైలపడిపోవుదురుగాబోలును. జెయి లులో జార్జిచక్రవర్తిగారి యాతిథ్యము నందుకొనుచున్న మీ భర్త గారి నిప్పుడే సందర్శించివచ్చితిని.

రాజ్య—నీకు వచ్చినదేమో నిప్పనికి వచ్చినవి? నన్ని సమయములో నెకసక్కె మాడవచ్చితివా? తులువా దూరముగబో.

శంక—నీ కేమి? నీవు గుండె రాయి చేసికొని శిఖండివలె జెయిలులో గూర్చున్నావు. సాటి వెలనాటియాడుపడుచున కిట్టి గతి వచ్చినదే మిరా యని మేము వీధిలో తలయెత్తుకొనలేకుండ నున్నాము.

రాజ్య—ఇది యంతయు నీ పన్నుగడ.

శంక—ఇదివరకు చేసిన నేరములు చాలక నాపయి మిథ్యావాదములు వేయుచున్నావా? జాగ్రత.

రాజ్య—భగవంతు డనువా డున్నచో నిజము నిలుకడమీాదనైన తేలకపోవునా?

శంక—నీ నిఘంటువులో నిజమున కబద్ధమని అబద్ధమునకు నిజమని యర్థమున్నదా? నీభర్త స్వయముగ సంతకము చేసిన కాగితములాతనిపయి నేరమును స్థాపించుచుండగ ఇంకను వేరుగ నిజ మెక్కడనో యున్నట్లు ఆఘోరించెద వేమి? మరెవ్వరునుకాదు. శ్యామసుందరదత్తు జిల్లాజిడ్జీగ వచ్చినాడు. మీా నాటకము లెవ్వియు సాగవు. లంచము పట్టడు. సిఫారసు వినడు. ఇదిగో. నాసలహా విను. ఇంకను కేసు కమిటెంగుకోర్టు కయినను రాలేదు. నేను చెప్పిన మాటకు 'ఊ' అంటివా నీమీాద నేరము లేకుండ చేసెదను.

రాజ్య—కారుకూతలు కూయకు. ఇంకొక్క నిముష మిక్కడ నిలచినచో నిన్నెంత యల్లరిచేసెదనో చూచుకో. పబ్లికుప్రోసిక్యూటరువు గదా. పరువు దక్కనీయను.

శంక—(స్వగ) ఇది పట్టిగయ్యాళి. త్వరగ దాటవలెను. లాభములేదు. (ప్రకా) చింత చచ్చినను పులుపు చావలేదు. శంకరరావు మజాకా యింకను నీకు తెలియలేదు. సరే. కానీ. అనుభవింతువుగానిలే. (నిష్క్రమించును.)

రాజ్య—దైవమా! నీచేత లింత విపరీతముగ నున్న వేమి? ప్రార్థించిన
కొలది పాషాణహృదయుడ వగుచున్నావే.

ఉ. పాలన సేయగా దగదొ! బాల్యమునుండియు దారుణాగ్నిలో
గూలి తపించు నాహృదయ ఘోషము వీనుల కెక్కకున్న దో!
తాళగలేను. కష్టమయ తాండవఖేలన మాచరించు నీ
లీలకు చేతు లొగ్గెదనులెమ్మ. కృపామతి రమ్మ శ్రీహరీ.

[ తెరలో బ్రహ్మనందస్వామి ఈక్రిందికృతి పాడును. ]

త్యా గ రా య కృ తి

కాలహరణ మేలరా హరీ! సీతారామ కాల॥
కాలహరణ మేల సుగుణజాల కరుణాలవాల కాల॥
చుట్టిచుట్టి పక్షులెల్ల చెట్టు వెదకురీతి
పుట్టగానె నీపదములు బట్టియున్న నన్ను బ్రోవ కాల॥
దినదినమును తిరిగి తిరిగి దిక్కులేక శరణుజొచ్చి
తనువు ధనము నీవేయంటి త్యాగరాజ వినుత కాల॥

రాజ్య—అహో! ఏమి ఈగానమాధుర్యము.

చ. హృదయము పల్లవించె. సకలేంద్రియపఙ్క్తియు నూత్నజీవసం
పద నలరారె. నాత్మకు నరాభ్యుదయాస్పద మొక్క తేజ మిం
పొదవ జనించి, లో నిదురనొందెడు శక్తుల మేలుకొల్పి, నీ
పదముల చెంతకున్ దిగిచి భక్తిరసార్ద్రి మొనర్చె శ్రీహరీ.

అదిగో! గురుదేవు డిటువచ్చుచున్నాడు. స్వామీ! నమస్కా
రము.

బ్రహ్మ—(ప్రవేశించి) సుపుత్రావాప్తిరస్తు! నీనాథుని హృదయ
ములో నెంతటి మార్పువచ్చినదో యెరుగుదువా? ఇప్పు డాత
నికి నీ నామజపముతప్ప వేరుపని లేదు. నీవు బ్రదికియున్నావా

లేదా యనువిషయమునుగూర్చి మిక్కుటముగ నాందోళనపడు చున్నాడు.

రాజ్య—దాని కేమున్నది? రేపు కమిటింగుకోర్టులో మేమొకరి ప్రక్కనొకరు నిలువబడినప్పుడైన తెలియకుండునా? భర్త్రృసంయోగమునకయి ప్రార్థింపగ భగవంతుడెంతచక్కగ సమకూర్చినాడు! ఇంకొక్క నిముసము తమరాక యాలస్యమయినచో నేమి జరిగియుండెడిదో?

బ్రహ్మ—అమ్మా! ఆత్మహత్య తలపెట్టకుమా!

రాజ్య—ప్రస్తుత మట్టి యుద్యమమును విరమించుకొంటిని లెండు. సంజీవివలె నేదో శుభవార్త రవంత చెవిని వైచినారుగాదా.

బ్రహ్మ—ప్రస్తుతమే కాదు. ఎన్నటికి నట్టితలంపునకు చిత్తములో తావీయనని నాకు వాగ్దానము చేయవలెను.

రాజ్య—గుర్వాజ్ఞ జవదాటుదునా? కాని ఎన్నటికయిన నీవిపత్పరంపర కంతముండునా?

బ్రహ్మ—తొందర పడకుము. ఇదమిత్థమని నేను చెప్పజాలకపోయినను తప్పక మీ దంపతులనిర్దోషిత్వము ప్రకటమగునను నమ్మకము నాకున్నది. మాధ్యాహ్నికములకు వేళయగుచున్నది. పోయి వచ్చెదను.

రాజ్య—దాసురాలిపయి దయయుంచుడు. నమస్కారము. నానాథునికి నానామజపము, నాకు నానాథుని నామజపము జీవనౌషధములు.

బ్రహ్మ:—చ. పరమపతివ్రతాగుణుల బంధురకీర్తికి జన్మభూమి, సు
స్థిరతరజ్ఞానరాశులకు చేరువచుట్టము, భక్తకోటికిన్
గురుపద మైనభారతము కోవిదవంద్య భవచ్చరిత్రచే
నురుతరకీర్తి గాంచె సన నొండొకపల్కు వచింపనేటికిన్.

(బ్రహ్మ॥ నిష్క్రమించును తెరపడును)

---

# రాజ్యలక్ష్మి



## ఆరవ అంకము



### మొదటిరంగము

ప్రదేశము—పూర్ణయ్యయిల్లు

[ప్రవేశము—ప్రభాకరము. పూర్ణయ్య]

పూర్ణ—నాకు మతిలేకుండ నున్నది. ఈకేసు నుండి వీరిని తప్పించు నుపాయ మెద్దియు గానరాకుండనున్నది.

ప్రభా—పాపము! స్వాములవారు తమశిష్యులచే చందాలు వేయించి మద్రాసునుండి డిఫెన్సుకయి అడ్వొకేటును దెప్పించినారు. కమిటింగుకోర్టులోను శెషన్సుకోర్టులోను కూడ ఆతడు శాయశక్తుల తంటాలుపడినాడు—కాని ఆతనికిగూడ నేమియు నుపాయము తట్టినట్లు కానరాదు.

పూర్ణ—ఈదినమున నార్గుమెంటులు కదా—ఆర్గుమెంటులలో మాత్ర మేమి చెప్పగలడు!

ప్రభా—పాపము! ఇదివరలో శిక్షకావలె నని కోరుకొనుచున్న జగన్మోహనరావు రాజ్యలక్ష్మీదేవి బ్రదికియున్న దని తెలియగనే ఎట్లయిన ఈవలబడవలెనని నీరు విడిచిన చేపవలె గిలగిల కొట్టుకొనుచున్నాడు.

పూర్ణ—పిల్లలు లేనివాడ నయినను నేను వారి యవస్థ చూడ లేకుండ నున్నాను. అన్యోన్యసమాగమమునకై అపరిమితానందము అనివార్యమైన దురవస్థజూచుకొని అపరిమితదుఃఖము ననుభవించుచున్నారు.

ప్ర—అసలు రాజ్యలక్ష్మి చనిపోయి నట్లసత్యవార్త యెందులకు జెప్పించినారు ?

పూర్ణ—అది మాస్వాములవారి యాజ్ఞ. రాజ్యలక్ష్మివంకకు తిరిగిన జగన్మోహనుని యనురాగము దృఢపరచుటకయి వారట్లు చేసినారు. అయితే అప్పట్లో అదివరకే మీకు తటస్థించిన యాపదలనుగూర్చి మాకు తెలియదు.

ప్రభా—రాజ్యలక్ష్మిదేవి నాటకరంగ మెక్కినదనగ నప్పుడే గాదు; ఇప్పటికిని నేను నమ్మజాలకున్నాను.

పూర్ణ—ఆమె యొకపట్టున నంగీకరింపలేదు. కాని నాట్యకౌశల్యమును బురస్కరించుకొని నటీమణుల బ్రేమించుచున్న యాతని చిత్తవృత్తి మరల్చుట కంతకంటె నుపాయములేదని స్వామి బ్రతిమాలిన పిమ్మట ఆమె అంగీకరించినది. అయితే ఆనాటకసమాజమున నందరుస్త్రీలే. సారంగధరపాత్రమును ధరించినది లీలావతియను స్త్రీ. నాట్యకళాకుశలురుగదా! మీ రామాత్రము గనిపెట్ట లేకపోయితిరా ?

ప్రభా—ఆరోజున మే మీ ప్రపంచములో నున్నామా ? మాకు తటస్థించిన ఘోరవిపత్తులను బురస్కరించుకొని మతిపోయినది. దానికితోడు జగన్మోహనరావు కొలదిగ ద్రాక్షరసమునుగూడ సేవించినాడు. కాని మీస్వామిచరిత్రము చిత్రముగ నున్నదే! కడుపా? వీపా? ఆతని కీ జంజాటమంతయు నెందులకు ?

పూర్ణ—అదే వారిచరిత్రములో నున్న చమత్కారము. అడవిలో నొంటరిగ ముక్కుమూసికొని కూర్చుండుట కంగీకరింపరు. తాము సిద్ధపురుషులయ్యు బద్ధుల కష్టసుఖములలో పాల్గొనుచుందురు. ఏమయిన నేమి? వారి బుద్ధికికూడ అతీతమైన యాపద తటస్థించినది గదా ?

ప్రభా——ఒకచిక్కు వదలగ యింకొకచిక్కు తటస్థించినది. అదిగో! పదినిముషములు తక్కువ పదునొకండు. కోర్టుకు పోవుదమా?

పూర్ణ——నాకు మనస్కరించకుండ నున్నది. నేనాశ్రమమున నుందును. ఏమి జరగినది వచ్చి నాతో చెప్పుము.

ప్రభా——సరే. కానిండు. మీది బొత్తుగా మెత్తనిమనసు.

(నిష్క్రమింతురు.)

---

## రెండవ రంగము

ప్రదేశము——విద్యాపురములోని సెషన్సుకోర్టు
సమయము——10—55 నిముషములు.

[ప్రవేశము——పబ్లికు ప్రోసిక్యూటరు శంకరరావు, అతని జూనియరు శేషగిరిరావు, డిఫెన్సు అడ్వొకేటు రాజారావు, అతని జూనియరు శ్రీధరరావు, ఇతరప్లీడర్లు, బెంచిక్లార్కు, ట్రాన్స్లేటరు, డలాయతులు వగయిరాలు యథోచితాసనములలో గూర్చుండగ తెరయెత్తవలెను. జడ్జీయింకను రాలేదు. డాక్‌లో ముద్దాయీలు లేరు.]

[డఫేదారువచ్చి హుస్సని ధ్వనిచేయుచు జడ్జీగారు కూర్చుండవలసిన కుర్చీ సర్దును. వెనుకనే జడ్జీ శ్యామసుందరదత్తు ప్రవేశించును. అందరును నిలువబడి జడ్జీగారు కూర్చుండగనే కూర్చుందురు. ముద్దాయీలను 1 జగన్మోహనరావు. 2 రాజ్యలక్ష్మి డాక్‌లో నిలువబెట్టి డాక్ కిరుప్రక్కలను పోలీసువారు కావలియుందురు. నలుగురు అసెసర్లు వచ్చి వారివారి స్థానములలో నుందురు.]

బెంచిక్లార్కు——సెషన్సుకేసులో ఆర్గుమెంటులు.

[అని కేసుఫైలు జడ్జీగారి కందిచ్చును.]

శంక——(లేచి) ఘనతవహించిన కోర్టువారికిని అసెసరుమహాశయులకును విన్నవించునదేమనగ——

ఈ కేసులో సావధానముగ మీరు సాక్ష్యమును చిత్తగించి నారు. యుక్తాయుక్త వివేచనాశీలు రగు మీకు స్వల్పసంఖ్యాకులగు సాక్షులున్న యీ కేసులో దీర్ఘముగ నార్గుమెంటు చెప్పుట నా కంత యగత్య మని తోచదు. అట్లు చెప్పుట మీబుద్ధివైభవము నధిక్షే పించుటే. అయినను వాలాయతు తీర్పవలెను గనుక రవంత మనవి చేసెదను. రెండవముద్దాయీ అయిన రాజ్యలక్ష్మిపయి కేసు ఏమియు ఋజువుకాలేదు. ఆమెను విడుదల చేయవచ్చును.

శ్రీధర—(నారాయణరావు అను ప్లీడరుతో) శంకరరావుగారి గడును దనమును చూడు, కేసులో నీరసముగనున్న భాగమును నీరసముగ నున్న దని యొప్పుకొన్నచో తక్కిన భాగమునకు బలము చేకూ రును గదా!

నారా—అబ్బో! ఆరితేరిన వృద్ధమూర్తి.

శంక—ఇక “1 వ ముద్దాయి ఎంతవరకు నేరము చేసియుండును” అనునది ప్రశ్న. ఈప్రశ్నను విచారించుటకు పూర్వము ఒక చిన్న యంశమును వక్కాణింపవలసివచ్చినందులకునన్ను క్షమింతురుగాక.

విద్యావంతుడును న్యాయశాస్త్రవిచక్షణుడును జగత్ప్రఖ్యా తుడు నగు 1 వ ముద్దాయీయెడల మనకందరకు సానుభూతి యుండుట సహజము. నిజమునకు నామట్టుకు నేను నోటితో నెంత తీవ్రముగ వాదించుచున్నానో హృదయములో నంతయగాధమైన యీ వేదనను భవించుచున్నాను. మనపురవాసియు ఇదివరలో యీ బారులో మెంబ రును ఈయూరికేగాక ఈదేశమున కంతకు ప్రఖ్యాతి తెచ్చినమహా శయుడును విశేషించి నాకు మిత్రుడును అయిన వీరియెడల నాహృ దయ మార్ద్రి మగుచున్నందులకు మీరు నన్ను మన్నింపవలెను.

కాని రాజశాసనములు దేశక్షేమము నిమిత్త ముద్దిష్టములైనవి. వానికి పెద్దచిన్న తారతమ్యములులేవు. అవి అగ్నికణముల వంటివి.

అగ్నికణములను సామాన్యుడు స్పృశించినను ఒక్కటే! విశ్వవిఖ్యాతుడు స్పృశించినను ఒక్కటే. ఇరువురను సమానముగనే కాల్చివేయును. ఇంకొక విశేషము. తెలియనిమూఢులు చేసిన నేర మొకప్పుడు న్యాయశాస్త్రదృష్ట్యా తక్కువశిక్షకర్హము కావచ్చును గాని యూనివర్సిటీపట్టభద్రులయి యున్నతస్థానము లలంకరించుచు సంఘమునకెల్ల ఆదర్శపురుషులుగ నుండదగినవారు బుద్ధిపూర్వకముగ నేనేరమయిన నొనరించినట్లు స్పష్టమయినచో నది మరింతకఠినమైన శిక్షకు పాత్రమనుట నిర్వివాదాంశము!

అనవసరవాక్యాడంబరమునకు పోయి ఆర్గుమెంటు పొడగించుట యెన్నడు నామతము కాదు. ఇందు ముఖ్యముగ మీరు పరీక్షింపదగినవి ఎగ్జిబిట్లు సి–సీరీసు (C-Series) జాబులు. ఇవి విద్యాపురవాసియు, అప్రూవరున్ను, P. W. 1 న్ను అయిన, సగరము వెంకన్న పేర మొదటి ముద్దాయీ జగన్మోహనరావుగారు విదేశముల నుండి వ్రాసిన జాబులు. ఈ జాబులలోని సంతకములు వారివే అయినట్లు P. W. 5, 6 లు ఋజువుచేసినారు. ఇవి ఆయాప్రదేశములనుండి వచ్చినట్లు పోష్టుముద్రలు వగయిరాలు తెలుపుచున్నవి. అవికూడ P. W. 7 & 8 వలన ఋజువు కాబడినవి. అప్రూవరయిన సగరము వెంకన్నకూడ వీని యాథార్థ్యమును ఋజువు చేయుచున్నాడు. ఈ జాబులనుబట్టి కోర్టువారి ముందున్న M. O. లు 5-9 కట్టలదొంగ నోట్లను తయారుచేయుటకు గల పూర్ణమైన బాధ్యతయంతయు 1 వ ముద్దాయిదే అయినట్లు స్పష్టము. అదిగాక M. O. లు 9–11 సంఖ్య గల నోట్లకుపనికివచ్చుకాగితపుబేళ్లను M. O. లు 11–20 నెంబర్లు గల యంత్రసామగ్రియును 20–22 నెంబర్లుగల సిరాసీసాలువగయిరాలును, 1 వ ముద్దాయీ కొని పంపి నోట్లను తయారుచేయు విధానముగూర్చియు, వానిని మార్పింపవలసిన విధానమును గూర్చియు

1 వ ముద్దాయీ P. W. 1 నగరము వెంకన్న పేర వ్రాయుచున్నట్లును ఈవ్యాపారమున కగు పెట్టుబడి యంతయు 1 వ ముద్దాయీదే అయినట్లును ఈ C-Series జాబులవలన ఋజువయినది. మూజువానీ సాక్ష్య మయినచో సందేహమున కవకాశ ముండునుగాని నిస్సందిగ్ధముగ ఋజువు కాబడిన కాగితములపయి అందును 1 వ ముద్దాయీ సంతకములతో నున్న కాగితములపయి నాధారపడియున్న యీ కేసులో తటపటాయించుట కేమున్నది? కాగితము లబద్ధ మాడజాలవుగదా!

[స్నేహాలత తొందరగ కోర్టులో బ్రవేశించి కోర్టువారి సమీపమునకు వచ్చి నిలచి నమస్కారపూర్వకముగ నిట్లు పలుకును]

స్నేహ—పబ్లికుప్రాసిక్యూటరుగారి యార్గుమెంటు కడ్డువచ్చుచున్నందులకు క్షమింపవలెను. ఈ కేసులో నాకు తెలిసినకొన్ని ముఖ్యమయిన సంగతులున్నవి. అవి యీ కేసుకు ప్రాణము వంటివి. కోర్టువారు నాయందు దయయుంచి నాసాక్ష్యమును పుచ్చుకొనవలెనని ప్రార్థించుచున్నాను.

శ్యామ—కేసులో ఆర్గుమెంటు లగుచున్నవి. సాక్ష్యము తీసుకొను సమయ మిదివరకే దాటిపోయినది. ఇప్పుడు మీ యంతటమీరు వచ్చి సాక్ష్య మిచ్చెద ననుచున్నారు. ఎట్లు పొసగును?

రాజ్య—(తనలో) అమ్మా నిన్ను నానాథుడు వదలినను నీవు నానాథుని వదలవు కాబోలును!

జగ—(తనలో) ఈమె నాపయి కసిదీర్చుకొనుటకు వచ్చినది కాబోలును.

శంక—(శేషగిరిరావుతో నపవారించి) ఈమెకును జగన్మోహనరావుకును చెడిపోయినది కాదా?

శేష—(రహస్యముగ) ఆహా! పూర్తిగ చెడిపోయినది.

శంక—(రహస్యముగ) అయినచో నీమెసాక్ష్యము మన కనుకూలముగ నుండు ననుటకు సందేహములేదు. (ప్రకా) ఈమెసాక్ష్య మీ

కేసులో చాల యావశ్యకము. ఈమెనుకూడ సాక్షిగ తనిఖీ చేయ వలసియుండు నని ఇదివరకే నేను పోలీసువారికి సలహాయిచ్చితిని కాని ఈమె అడ్రెసు తెలియక యూరకుండిరి.

డిఫెన్సుఅడ్వొకేటు—ఈమె నిప్పుడు పరీక్షించినచో ముద్దాయీకి కూడిరాని నష్టము సంభవించును. ఇదివర కీమెను కమిటింగు కోర్టులో విచారించియుండలేదు. ప్రస్తుత మీామెకును 1 వ ముద్దా యీకిని విరోధ మనుట జగత్ప్రసిద్ధమే. కావున 1 వ ముద్దాయీకి వ్యతిరేకముగ నీమె యేమిచెప్పినను దానికి విలువయుండదు.

శ్యామ—సాక్ష్యమున కీయదగిన విలువ మాటనటుండనిండు. ఈమె నీసమయమున పరీక్షింపవచ్చునా లేదా యనునది మొదటిప్రశ్న. పరీక్షించినచో ప్రాసిక్యూషను తరఫున పరీక్షించేదా డిఫెన్సు తరఫున పరీక్షించేదా యనునది రెండవప్రశ్న. (స్నేహాలత వంక దిరిగి) మీాసాక్ష్య మెవరి కనుకూలముగ నుండునో ఇంచుక సూచింప గలరా?

ప్రణ—సత్యమునకును న్యాయమునకును అనుకూలముగ నుండును.

డి॥అ॥—కోర్టులో సాక్ష్యమీాయ వచ్చు వారందరు తాము సత్యహరి శ్చంద్రునికి సన్నిహితబంధువులమనియే చెప్పుకొందురు. డిఫెన్సు తరఫున ఈమెను నేను పరీక్షింపదలచుకొనలేదు.

శంక—కోర్టువారు క్రిమినల్ప్రొసీజరుకోడ్డు 540 శెక్షను చూడనగును.

శ్యామ—(ప్రొసీజరుకోడ్డు తిరుగవేయును.)

శంక—" Any court may, at any stage of any inquiry, trial or other proceeding under this code, summon any person as a witness, or examine any person in attendance, though not summoned as a witness, or recall and re-examine any person already examined; and the court shall summon and examine

11

or recall and re-examine any such person if his evidence appears essential for the just decision of the case" (అను శ్లోక్షను చదివి) దీనినిబట్టి కోర్టువారికి ఈసాక్షిని తనిఖీచేయుటకు అవ్యాహతమైన యధికారము మున్నదనుట నిర్వివాదాంశము.

డి॥ అ॥—"If his evidence appears essential to the just decision of the case" అని యున్నది. "Just decision of the case"కు ఈవిడ సాక్ష్యమెంతవరకు "essential" అను విషయమును నిర్ణయించుటకు ఇంతవరకు మనకెట్టి యాధారమును లేదు. తనంతతానుగ volunteer చేయుచున్న ఈసాక్షి సాక్ష్యమును పుచ్చుకొనుటకు వలనుపడదని నేను గట్టిగ వాదించుచున్నాను.

శ్యామ—తనిఖీ చేయవచ్చునా లేదా యనుమాట నటుండనిండు. శంకరరావుగారూ! తనిఖీ చేయవచ్చుననియే ఒకవేళ స్థిరపరచినను ఈమె సాక్ష్యమువలన మీకేమి ప్రయోజనము? 1 వ ముద్దాయికిని యీమెకును విరోధమనుట జగత్ప్రసిద్ధమేగదా!

జగ—న్యాయాధికారి యిప్పటికి దారిలోనికి వచ్చుచున్నాడు.

స్నేహ—ఈకేసులో నేనయి మూజువానీగా చెప్పు సాక్ష్యమేమియు నుండదు. నేను కొన్ని కాగితములు దాఖలుచేయుదును. తరువాత ఆ కాగితములు నాకెట్లు వచ్చినదియు వివరింతును. ఇంతే నాసాక్ష్యము.

శంక—ఈమెను కోర్టుసాక్షిగ తనిఖీ చేయవలసినదని నేను పిటీషను దాఖలు చేయుచున్నాను. (శేషగిరిరావు తనచేతికిచ్చిన కాగితములు జడ్జీకిచ్చును.)

జగ—(తనలో) ఇంతవరకు జాబులలో నాసంతకములు ఎట్లువచ్చినవా యని గిజగిజ కొట్టుకొనుచున్నాను. స్నేహలత శంకరరావుతో గలసి నాకొంపదీసినది. హా! గోముఖవ్యాఘ్రమా! ఎంతపని చేసితివి?

రాజ్య—(తనలో) భగవానుడా! న్యాయాధికారి హృదయమున బ్రవేశించి యీమె సాక్ష్యము నంగీకరింపకుండునట్లు చేయవలెను.

శ్యామ—ఈమెను కోర్టుసాక్షిగ తనఖీచేయుట కాజ్ఞయిచ్చుచున్నాను.

జగ—(తనలో) హరిహరీ!

రాజ్య—(తనలో) భగవంతుడు లేడు. ఇక నెందులకు? నా కీదినమున తేటతెల్లమయినది. భగవంతుడు లేడు.

శంక—కోర్టువారు న్యాయము దయచేయించినారు.

ట్రాంస్లేటరు—అమ్మా నీవు బోనెక్కుము.

[స్నేహలత బోను నెక్కగ ట్రాంస్లేటరు ప్రమాణముచేయించును.]

స్నేహ—ఇవిగో నేను దాఖలుచేయుచున్న కాగితములు.

[అని యాకాగితములు బెంచిక్లార్కు చేతి కిచ్చును.
బెంచిక్లార్కు జడ్జీచేతికిచ్చును]

శ్యామ—(ఆకాగితములను చదువుకొని) ఇవి మీకెట్లువచ్చినవి?

స్నేహ—నేనును జగన్మోహనరావుగారును నాటకసమాజ మొకటి స్థాపించి దానితో విదేశయాత్రలకు బోయితిమి.

శ్యామ—అది జగత్ప్రసిద్ధమే. కాని దానికిని ఈకేసునకును ఏమిసంబంధము?

స్నేహ—మా సమాజములో కొందరు స్త్రీలుకూడ ఆక్టర్లుగ నుండిరి. అందు రామామణి యొక్కతె. ఆమె నాకడను జగన్మోహనరావుగారికడను కూడ చనవుతో మెలగుచుండెడిది?

శంక—భ్రష్టస్యకావాగతిః ? ఎన్నిశ్రోత్రియకుటుంబము లిట్లు పాడయి పోవుచున్నవో.

స్నేహ—రామామణి అమ్మాణి యను వేశ్యకూతురు. అమ్మాణి యనిన శంకరరావుగారి కభిమానము.

శంక—(కనులెఱ్ఱచేసి) నన్ను నలుగురిలోను అవమానపరచుచున్నం దులకు—

శ్యామ—మీ పిటీషనుమీదగదా ఆమెను తనిఖీచేయుచున్నాను. శంకరరావుగారూ ! మీరామెను సాక్ష్యము చెప్పనిచ్చెదరాలేదా ?

డి॥ అ॥— ఇ దేదో కథ యెదురు తిరుగుచున్నట్లున్నది.

స్నేహ—శంకరరావుగారికి రామామణికి గలస్నేహము నాలుగవ యుత్తరము వలన వెల్లడియగుచున్నది.

శ్యామ—(అసెసర్లవంకదరిగి) ఈజాబు లన్నియు శంకరరావుగారు రామామణిపేర వ్రాసినవి. 1 వ ముద్దాయి మద్యపానమత్తుడయియుండగ వారిచే రామామణి ఇదివరలో నీ కేసులో ఎగ్జిబిట్లు C-Series క్రింద మార్కుచేయబడిన చెప్పుఉత్తరములపయి సంతకములు చేయించినట్లును అందులకు పారితోషికముగ రావుగా రామెకు మూడు వేలరూపాయ లిచ్చునట్లును ఈరూపాయి లిచ్చు వరకు రావుగారు వ్రాసిన జాబులను హామీగ నుంచుకొనునట్లును ఏర్పాటు జరగినట్లు ఈయుత్తరముల వలన విస్పష్టమగుచున్నది.

శంక—(తనలో) చచ్చితినిరా దేవుడా !

జగ—(తనలో) బ్రదికితిసిరా భగవంతుడా !

శ్యామ—ఈ యుత్తరములు మీ కెట్లువచ్చినదియు ఇంకను ఋజువు కాలేదు.

స్నేహ—రామామణి నాతో బొంబయి వచ్చినది. అచ్చట హటాత్తుగా కలరావచ్చి మొన్ననే మరణించినది. ఈ death

register extract ఆమె మరణమును ఋజువుచేయగలదు. (దాఖలు చేయును). ఆమె మరణానంతరము మధ్యవర్తులను దగ్గర నుంచుకొని నేనామె పెట్టెలు వగయిరా పరీక్షింపగా నాకీజాబులు దొరకినవి. వెంటనే నేను మెయిలులో బయలుదేరి తిన్నగ ఈ యూరు చేరి యకాయకిని కోర్టుకు వచ్చితిని.

శ్యామ—ఈ దస్తూరీ శంకరరావుగారిదే యని యెట్లు ఋజువుచేయ గలరు ?

స్నే—శంకరరావుగారు మాతండ్రిగారి మరణానంతరము నాకు గార్డి యనుగా నున్నారు. వారి దస్తూరీ నాకు తెలియును. అప్పుడప్పుడు వారు నా పేర వ్రాయుచువచ్చిన జాబులివిగో.

శం—(తనలో) హాతోస్మి ! ఈముండ నాకొంపదీయునని ఎన్నడు ననుకొనలేదు.

శ్యామ—శంకరరావుగారూ ! దీనికి మీ రేమిచెప్పెదరు ?

శంక—ఏమియు చెప్పను. కోర్టువారి చిత్తము—

శ్యామ—గుమాస్తా ! ఆయుత్తరములువగయిరా కాగితములను ఎగ్జి బిట్లుగా మార్కుచేయుము—(అసెసర్లతో) వానిని పరిశీలించి కేసులో మీయభిప్రాయమేమో చెప్పుడు. (అని గుమాస్తా చేతి కిచ్చును. గుమాస్తా త్వరగ వానిని మార్కుచేసి అసెస్సర్ల కిచ్చును.) శంకరరావుగారు ! ఈ కేసులో యింకను ఆర్గుమెంటు ఏమయినను తరువాయి యున్నదా ?

శంక—ఏమియు లేదు—అంతయు పూర్తియైనది—

జ॥ అ॥—యూనివర్సిటీ పట్టభద్రులయి యున్నతస్థానముల నలంకరిం చుచు జాతి కంతకు ఆదర్శపురుషులుగ నుండదగినవారు బుద్ధిపూ ర్వకముగ నే నేరమయిన నొనరించినట్లు స్పష్టమయినచో నది మరింత కఠినమగుశిక్షను పాత్రమనుట నిర్వివాదాంశము. శంకర రావుగారూ ! కాగితము లబద్ధమాడ జాలవుగదా ?

శ్యామ—ఈ కేసులో మీయభిప్రాయమేమి. (అని అసెస్సర్ల నడుగును.)

మొ॥ అ॥—ఈ కేసులో 1, 2 ముద్దాయీలు ఇరువురు నిరపరాధులని నాయభిప్రాయము—[ఒకరి వెనుక నొకరుగ తక్కిన వారును ఆలాగుననే చెప్పుదురు.]

శ్యామ—(జడ్జిమెంటు వ్రాయుట నభినయించును.)

నారా—వీనియిల్లు వల్లకాడుగాను. ఎంతపని చేసినాడురా ?

ఇంకొక ప్లీడరు—ఇంత పద్మవ్యూహము పన్నినాడే ! ఇదంతయు నెందులకో?

నారా—తన పబ్లికుప్రోసిక్యూటరీపదవి కెక్కడ భంగము తెచ్చునోయని స్నేహలతకు, జగన్మోహనరావుకు జతకలిపి విదేశయాత్రలకు ప్రోత్సహించినది ఈతడే యని కొందరు వదంతిగ చెప్పుకొనెడివారు. అయితే అప్పుడు నేను దానిని నమ్మలేదు.

ఇంకొక ప్లీడరు—మరల నెంతసిష్ఠ ! ప్రతిదినము అష్టాక్షరీమంత్రజపము ! భగవద్గీతా పారాయణము ! ఏటేట దేవీనవరాత్రులు ! ఓ ! నటనకు లోపములేదు. నిజముగ నటచక్రవర్తి యనుబిరుద మీతని కీయవలసినది.

శ్యామ—1, 2 ముద్దాయిలను నిర్దోషులుగ నిర్ణయించి నేను విడుదల కాజ్ఞయిచ్చుచున్నాను. (పోలీసువారితో) శంకరరావుగారి నరెస్టు చేయుడు. (రాజ్యలక్ష్మిని, జగన్మోహనరావును విడిచి శంకరరావును నరెస్టుచేయుదురు. జడ్జీ దిగిపోవును.)

రాజ్య—(పరుగుపరుగున వచ్చి స్నేహలతకు నమస్కరించును) తల్లీ ! నీవు మాకులదేవతవు. ఇంతవరకు నిన్నపార్థము జేసికొనుచు వచ్చిన నన్ను మన్నింపుము.

గీ. పూత మయి, దివ్య మయి, స్వయంజ్యోతి యగుచు
వెలుగు నీప్రేమ తత్త్వంబు తెలిసె నేడు;
సాధులోకంబునకు శిరసావహింప
వలయు నీ చరిత్రమున కంజలి ఘటింతు.

స్నేహ—తల్లీ! నీవు చేసుకొన్న యపార్థమెద్దియును లేదు. నీవు సరిగనే యర్థము చేసికొంటివి. నేనే నీయెడ ద్రోహ మొనర్చితిని.

ఉ. నీయెడ జేయు ద్రోహమున నిర్మితమైన యఘంబు నేటికిన్
బాయక ఛాయవోలె నను బట్టిగ్రసించుచు నున్న దక్కటా
హేయము నాదుజీవితము నెట్లు కృపామృతవృష్టి దేల్చి నా
త్మాయువు సంఘటించెదవొ యద్భుతదివ్యమహామనస్వినీ!

[ఇంతలో పూర్ణయ్య పరుగుపరుగున బ్రవేశించును.]

పూర్ణ—స్వాములవారి సెలవైనది. మీరందరును తక్షణమే యాశ్రమమునకు రావలయును. ఇది కోర్టుగదా మనమిచ్చట నాంతరంగిక విషయములు ముచ్చటించుకొనుటకు వలనుపడదు.

రాజ్య, స్నేహ, జగ—స్వామియాజ్ఞ శిరసా వహించుచున్నాము.

జనులు—జగన్మోహనరావుగారికి జయ్.

రాజ్య—ఆహా! నాకీ కోర్టే పరమపవిత్రమయిన ఋష్యాశ్రమము వలె గనవచ్చుచున్నది! నాకిచ్చట భగవంతుడు ప్రత్యక్షముగ గనవచ్చుచున్నాడు!

ఉ. ఆపదకీలనుండి దరహాసరసాంచితమైన మోముతో
ప్రాపయి నిల్చి యీశ్వరుని పావనమూర్తి తదీయవీక్షణో
ద్దీపితమైన యాత్మకొక దివ్యసుగంధము గూర్చె. భక్తిసం
స్థాపితచిత్తవృత్తి నయి శాంతిసుధారస మారగించెదన్.

---

## మూ డ వ ర ం గ ము

---

ప్ర దేశము—బ్రహ్మానంద యోగియాశ్రమము

ప్రవేశము—బ్రహ్మానందస్వామి, రాజ్యలక్ష్మి, జగన్మోహనరావు.

బ్రహ్మ—తల్లీ రాజ్యలక్ష్మీ! కష్టసోపానములతో భగవంతుడు నీకు జీవన్ముక్తిసౌధమును నిర్మించి యిచ్చినాడు!

గీ. పరమయోగీంద్రులకు నైన పాఠములను
గరపజాలిన పరిశుద్ధచరిత వీవు;
భరతజాతీయగౌరవప్రతిభ నిలుపు
పుత్రులను గాంచి దేశంబు బ్రోవవలయు.

జగన్మోహనా! నాడు జెయిలులో నేను నీకుపదేశించిన మంత్రాధిష్ఠానదేవత యిదిగో!

జగ—స్వామీ! అనుగృహీతుడను.

గీ. భక్తిమకరందరసపానసక్తహృదయ
సర్వమంగళగుణధామ! శాంతిసీమ!
భావిభారతజాతీయభాగ్యలక్ష్మి!
రాజ్యలక్ష్మి! నాహృదయసామ్రాజ్యలక్ష్మి!

(పరుగుపరుగున పూర్ణయ్యప్రవేశించును.)

పూర్ణ—అరుగో! నూతనదంపతులు స్వామికి నమస్కరింపవచ్చు చున్నారు.

[ప్రవేశము. స్నేహలత, శ్యామసుందర్]

స్నేహలత, శ్యామ } (స్వామిపాదములపయి వ్రాలుదురు.)

బ్రహ్మ—సకలకల్యాణగుణసమృద్ధు లగు మి మ్మేమని యాశీర్వదింపవలెనో తెలియకుండనున్నది. అయినను ఇట్లగుగాక!

శా. విద్యావైభవ ముల్లసిల్లగ గళావిజ్ఞానసీమంతినీ
హృద్యత్కీర్తి గడింత్రుగాక! బుధలోకేంద్రుల్ ప్రశంసింపగా
పద్యంబుల్ రచియింత్రుగాక! నటులై ప్రాక్పశ్చిమాశాంగనా
విద్యున్మాలికలై చరించెదరుపో విశ్వంబు లర్చింపగన్.

జగ—స్వామీ! అదేమది? నటులుగమ్మని యాశీర్వదించు చున్నారేమి? నటులవ్వె యిదివర కనుభవించినది చాలదా?

బ్రహ్మ—జగన్మోహనా! మీనలువురియందును భగవంతుడు అపురూపమగు నాట్యకలాప్రావీణ్యమును నిక్షేపించియున్నాడు. అందుచే నావిద్య నుద్ధరించుట మీకు స్వధర్మము.

జగ—కులసతులుకూడ నాటకరంగ మధిష్ఠింప వలసినదేనా?

బ్రహ్మ—సంతానవతు లగువరకు కులసతులు నాటకరంగము నలంకరించుటలో తప్పేమున్నది? సతీపతులు నాయికానాయక పాత్రములను ధరించిన చో ప్రమాదమున కవకాశము తక్కువ గదా. అదిగాక సినీమాలు వచ్చి స్త్రీపాత్రములను పురుషులు ధరించుట కవకాశమే లేకుండ జేయుచున్నవిగదా! మరియు పవిత్ర శీలలగు కులసతులు నాటకరంగ మధిష్ఠించువరకు దానికి సద్గతి చేకూరునట్లు తోచదు. లోకమునకు గురుపీఠముగ నుండదగిన నాటకరంగము తరచు విద్యాహీనులు, శీలహీనులు నగు నటుల చేతులలోబడి కేవలము వినోదసాధనము మాత్రమే యగుచున్నది. అందుచే మీబోంట్లు దీనినుద్ధరించుటకు కంకణము గట్టుకొన వలెను. వెనుకటివలెగాక మీరు పునీతులయి పునర్జన్మము నెత్తి నాట్యకళ నారాధింపుడు.

శా. సంగీతంబును చిత్రలేఖనము భాస్వత్కావ్యవైదగ్ధ్యమున్
రంగాగార మలంకరింపగ రసానందంబు సంధించి చి
చ్ఛృంగం బందు జగంబు సర్వము సుఖాసీనంబు గావించి స
ర్వాంగాత్కృష్ట్యము నిర్వహించుకొను నాట్యంబున్ బ్రసాదింపుఁడీ
జగ—స్వామీ! అనుగృహీతుడను. ప్రాతపద్యమునకే క్రొత్తయర్థము
స్ఫురించినట్లు ఇంతవరకు నిస్సారముగ గనవచ్చిన నాజీవితమున
కొక నూతనవికాసము వచ్చినది.

ఉ. సుందర మైు, కళావిభవ శోభిత మైు, మకరందబిందు ని
ష్యందిని యై, జగత్ప్రభవసంహరణస్థితి మూలకంద మై,
బంధురనాదపూర్ణపద భాసుర మై యలరారు సచ్చిదా
నందరసాత్మకం బయిన నాటకరాజము నాశ్రయించెదన్.

ఓంతంత్సత్.